# అభినవ తిక్కన

# సన్మాన సంచిక

ఆహ్వానసంఘము

అప్పికట్ల

# సమర్పణము

**మహాజనులారా! కవివతంసులారా! పండితవరేణ్యులారా!**

నేడు సుదినము. సుజనవరేణ్యులగు మిమ్మెల్లర దర్శించగలిగిన పండుగ. మా ఆహ్వానము నంగీకరించి శ్రమ మనుకొనక విచ్చేసిన మీ కెల్లరకు సుస్వాగతము. 'రాష్ట్రగాన' కవిచంద్రునకు, కవితా భర్తకు జోహారు.



ఆంధ్ర సారస్వతనికుంజమున నేడు క్రొంగ్రొత్త కుసుమమంజరులు పొడసూపుచుండుట రసికులగు మీవంటి ఆంధ్రభాషాకోవిదులకు తెలి

యనిది కాదు. 'వందే మాతరమ్' ఉద్యమముతోనే జాతీయగీతములు దేశము నలముకొన్నవి. 'సుజలాం, సుఫలాం, మలయజశీతలాం' అనే గీతాలీ యుద్యమముల తరువాతనే ఆబాలగోపాలము నేర్చుకొనినారు. జాతీయగీతాలతో పాటు, దేశనాయక ప్రశంస, కాంగ్రెసు, సత్యాగ్రహోద్యమాలను గూర్చి పద్యాలువ్రాసి కవు లుద్రిక్తులైనారు. ఇట్టి యుద్యమాలతోనే రాష్ట్రోద్యమసమస్యలు కూడా పుట్టి దేశమును రేకెత్తించినవి. ఇట్టి వాతావరణములో బుట్టినదే రాష్ట్రగానము. దీని కృతికర్త శ్రీ తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు. కృతిభర్త శ్రీ రాజా యార్లగడ్డ శివరామప్రసాద్ బహద్దర్ వారు.

కావ్యములు మాత్రమేగాక ఖండకావ్యములు, అనిబద్ధకావ్యములు, నవ్యదీధితులతో క్రొత్తవికాసమున మహాకావ్యములఁ గూడ క్రిందు సేయజాలియున్నవి. ఆంధ్రులు తలెత్తి తమ పూర్వగౌరవాన్ని మననము చేసికొనుచున్న దినములలో 'రాష్ట్రగానము' బయలుదేరినది. జాతి గౌరవాన్ని మేల్కొల్పి, ఆంధ్రుల నుద్రేకింపజేసి రాష్ట్రసాధనకై పురికొల్పి, ఉత్సాహమును రగుల్కొల్పినది. పదియుపన్యాసము లేని యిరువది నాటకప్రదర్శనములేని తాత్కాలికోద్రేకాన్ని కల్గింప వచ్చును. కాని, ఆ యుత్సాహము క్షణికము, బుద్బుదప్రాయము. కవి కావ్య మన్ననో అట్లు గాదు. ప్రతిపద రసస్ఫూర్తి కలిగిన పద్యములతో వెలయునదై సత్కవిత కార్యసాధనయందు పటిష్ఠమై, సహృదయు లున్నంతకాలము చిరస్థాయియై యుండగలదు.

ఇట్టి రసవత్తర కవిత్వము నాంధ్రులకు పంచియిచ్చి హృదయకోశమునందును, రక్తనాళములందును, మనఃప్రాకారములందును, వాక్ప్రవృత్తులయందును ఆంధ్రత్వమునే అచ్చుగ్రుద్ది వారి ప్రశస్తిని

కొనియాడినారు చౌదరిగారు. అట్టి యాంధ్రుల ప్రతిష్ఠకును, రాష్ట్ర సంపాదనకును తమ సర్వస్వము నొడ్డి, సర్వసంపత్తులను 'దేశజననీవిక్లేశ విచ్ఛిత్తికై' త్యాగముచేసి తమ యాశయములకు నిలయమైన 'రాష్ట్ర గాన' కావ్యకన్య తనను వరింపగా పరిణయధన్యం జేసి క్రొత్త తెలుగు పెండ్లికొమరుడైనా డీ రాజకుమారుడు శ్రీ శివరామప్రసాద్ బహద్దరు.

అట్టి ఉత్తమకావ్యరచనాపారవశ్యమున కవులును, తత్కావ్య కన్యాపరిష్వంగమున కృతిభర్తలును ధన్యులుకాగా ఆ ధన్యమూర్తులను ఆహ్వానించి కనులార గాంచి, ఆనందించి గౌరవించుభాగ్యము మా కబ్బినది. జీవచ్ఛవములైన ఆంధ్రులకు రాష్ట్రభాషాభిమానముల ప్రబోధించిన 'రాష్ట్రగాన' కృతికర్తను, కృతిభర్తను సత్కరించు భాగ్యము, అప్పికట్ల గ్రామపు నోములపంటగా మా కబ్బినందులకు గర్వింతుము. రాష్ట్రగానము ఆంధ్రమాత కడుపునబుట్టి నాల్గువత్సరములైనను, ఆంధ్ర ప్రాజ్ఞలోకము మాకుగా నీ పుణ్యము నిలువయుంచినది కాబోలు! 'ఆంధ్రమండల యశోనిర్మాణ కార్యైక దీక్షాసంపత్తి నెఱింగి పొంగిన' ఈ యాంధ్ర వీరుల నేటికి సత్కరింప నోచుకొన్నాము. వీరి యశస్సు ఆ చంద్రతారార్కము కాగలదని మేము ముదమందుదుము. వీరికి మా ధన్యవాదములు. మీకు మా ప్రేమాంజలులు. అనుగ్రహింపుడు. కావ్యానందమును అనుభవింపుడు. మాపరిమాదములున్న మన్నింపుడు.

ఇట్లు

అచంటి బుచ్చిరాయుడు చౌదరి
ఆహ్వాన సంఘాధ్యక్షుడు

అప్పికట్ల,
12—7—42

# ఆ భా ష ణా లు

సాహిత్యం సర్వతోముఖమైంది. దీనివల్ల గలిగే మార్పు ప్రచండమైన రాజశాసనం గూడ చేయలేదు. ఆశాసనం, ఆ కట్టుబాట్లూ ఆ రాజుతోనే నశిస్తవి. ఇదంటారూ? నిత్యనూతనంగా ప్రత్యణువులోనూ ప్రతినిత్యమూ క్షోభ దేస్తూనే ఉంటుంది.



ఒక్కొక్క దేశానికీ, ఒక్కొక్క సాహిత్యానికీ ప్రత్యేకత తప్పదు. ఎందుకంటారా? వారివారి ఆచారానుగుణ్యంగా అభిరుచులూ, ఆంతరంగిక వ్యవస్థలూ ఏర్పడతవి. సాహిత్యంగానీ, ప్రభుత్వం

గానీ ఏకముఖంగా నడవాలంటే కొన్నిశతాబ్దాలు పట్టక మానదు. దీనికి నేటి ప్రాచీ ప్రతీచీ సంప్రదాయమే తార్కాణం.

నిజమైన శాస్త్రకర్త కలంద్వారా శాసనానికి శాసనం చేస్తాడు. శాసనకర్త మాత్రం అతని అనుశాసనం పలుందాగా నడిపిస్తాడు. దేనిలో ఒడిదుడుకు వచ్చినా ఇరువురూ దేశద్రోహులు కాకతప్పదు. అంటే ప్రత్యేక విప్లవకారకు తౌతారన్నమాట. అందుకే ఇరువాగుల వారూ అవినాభావసంబంధంతో వర్తిస్తూ ఉండాలి. ఒకవేళ భిన్న భిన్నంగా ప్రవర్తిస్తారే చూడు నానామతాలు, అంతర్యుద్ధాలు బయ ద్దేరుతవి. లేకుంటే రాక్షసత్వమే శరణ్య మవుతుంది.

కాలాన్నిబట్టి సాహిత్యం మారుతుందన్నా సాహిత్యమే కాలాన్ని సేవిస్తుందన్నా ఒకటేకాని, కొన్నియేండ్లనాటి అభిరుచులూ ఆశయాలూ మఱికొన్నేండ్ల దాకా దాకా ఏమిటి? ఆకల్పము మారవని ప్రకృతి చాటుతుంది. దాన్ని గ్రహించే మహాకవైనవాడు అహర్నిశం సాహిత్యశిల్పం చెక్కడం ప్రారంభిస్తాడు. అది సర్వాంగ సుందరమైన దాకా విడువడు. దానితో అతడు విశ్వగురుత్వాన్ని పొంది తీరుతాడు. దీనికి కవికులగురువు లనిపించుకొన్న మన కాళి దాసాదులే సాక్ష్యం.

ప్రతికవియూ ప్రకృతి సంఘర్షణలోని మార్పులు గమనిస్తాడు. దానికి వలసిన సన్నివేశాలు గల్పించుకొని ఒక్కొక చోట వ్యంగ్య మర్యాదగానూ మఱొక్కొకచోట బాహాటంగానూ ఆవిషం వెళ్ళ గ్రక్కుతూనే ఉంటాడు. సామాన్యంగా దీన్ని విశ్వకవులపట్ల చూస్తూనే ఉన్నాము.

సిసలైన కవిహృదయం మారణయంత్ర మనుకొనండి. ఈ యత్యాచారాలు అందు భస్మమయి, స్థిరమైన జ్ఞానసృష్టి బయలుదేర్తు

తుంది. అదే యుగయుగాల పంట. దానికే సత్యలోకం ముగ్ధమవు తుంది. అందుకే ఈ పూలపందిళ్ళూ ఈ వెండితెరలూ ఈ బంగారు స్నానాలూన్నూ.

ప్రస్తుతం సన్మానింపబడే శ్రీ తుమ్మల సీతారామమూర్తిగారి కవితోపాసన వెన్నతో అలవడ్డది. దాదాపు ఇరువదేండ్లనుండి తెలుగు తల్లి నలరిస్తున్నది. ఈ పచ్చికాటూఅని వయస్సులో సర్వతో ముఖంగా విహరించి భూరిసన్మానా లందుకొన్నది. అందుకు గోడు మూ అప్పికట్ల పరగణాయున్నూ పూలదోసిలి పట్టింది. ఈ కవిశేఖరుని గౌరవించడమంటే సజావైన తెలుగు తల్లిని స్మరించడ మన్నమాట. ఈ విషయంలో నలువురి మనస్సులు ఏకీభవించి మాజతనానికి జవ మూ జీవమూ గూర్చినవి.

పూర్వమీలాంటి వసంతోత్సవాలు జరిపారంటే గజోత్సవాలు గండ పెండేరాలు, అభిషేకాలు, అగ్రహారాలు ఒకటేమిటి కొట్టికోలా హలంజేసేవారు. ఇంటువంటివి ఉత్సాహదాయకాలైనా కొన్ని మాత్రము తాత్కాలికా లనక తప్పదు. అలాగాకుండా కవిమీద ఆదరాభిమానాలు చూపించే కవులరచనలు సంపుటీకరించడం కనీస మైన సంఘధర్మం. అది అతని గ్రంథాలతో బాటు భాష కుపస్కార హేతువౌతుంది. అందుకే మేమీ సంచికను ప్రకటింప బూనింది కూడానూ.

దీన్ని పురస్కరించు కొని అడుగుటే తరువాయి మా ప్రయ త్నానికి ముట్టింది ముత్యమైంది. పట్టింది బంగారమైంది. కావున ఆ యా ప్రోత్సాహకులను ద్రవ్యదాతలను మనసా స్మరిస్తున్నాము.

శ్రీ చౌదరిగారిపై నెయ్యముతియ్యమునంజేసి అడుగుటే తడవుగా పద్యగద్యములు అదనుకు వ్రాసి పంపిన కవిమిత్రులకు నెనరు

చూపడం మావిధి. అందులకుగాను వారిఉద్యమం శుభోదర్కంగా ఉండాలి అని కోరుతూ నమస్కరిస్తున్నాము.

శ్రీ చల్లపల్లి ప్రభువు శ్రీ కుప్పుసామి చౌదరి మున్నగు ఆంధ్ర నాయకులు కోరినంతన ఇచ్చేసి మా ముద్దు చెల్లించినందులకు వారికి కృతజ్ఞులము.

మా కార్య నిర్వహణంలో మితిలేని ఉత్సాహమూ సహాయమూ చాకచక్యమూ చూపిన సోదరుడు కుర్రా వెంకట సుబ్బారావునకు కూడా మా కృతజ్ఞత చెప్పడం కర్తవ్యం.

అప్పికట్ల
12-7-42

ఇనగంటి వేంకటప్పయ్య చౌదరి
ఆహ్వాన సంఘాధ్యక్షుడు

# ప్రధానప్రోత్సాహకులు



కలశాబ్ధి కన్యకా కమనీయ లాస్యలీలారంగ మెవని యగారసీమ
నిరతదాన క్రియా పరతంత్ర పావన వ్యాపార మెవని నిత్యానుభూతి
తరుణేందుశేఖర ధ్యానకైంకర్యాది సేవార్త మెవ్వాని జీవితంబు
కవిరాజ సూరిశేఖర భూరిసత్కృతి ప్రవణ స్వభావ మెవ్వాని బుద్ధి

కమ్మకుల లక్ష్మి యెవ్వాని కన్నతల్లి
వాసిగాంచె నెవ్వాని వీరవల్లి వంశ
మాతనికి దానకర్ణున "కయ్యవార్ల"
కనఘునకు మెప్పులిచ్చు నాహ్వాన సమితి

# విషయ సూచిక

# ఆశీస్సులు

శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి

తుమ్మలవంశసన్మణి బుధుల్ గని మెచ్చెడి ప్రజ్ఞవాఁడు శ్రీ
కమ్మకులమ్మువాఁడు, కడుఁగమ్మనికైత రచించువాఁడు రా
ష్ట్రమ్మును గూర్చి గానమును సల్పి జగమ్మునఁ బేరుగాంచినాఁ
డిమ్మహితాత్మనామ మిట నేమిటికిన్ వచియింపఁగావలెన్

భగవంతుం డితనిన్ నిరామయునిగా భాగ్యాయురుచ్చైర్యశ
స్థగితుంగా సుఖవంతుఁగా స్ఫురదపత్యశ్రీకుఁగాఁ జేసి ప్రో
చు గుణాఢ్యుం డితఁ డే నెఱుంగుదు సదస్యుల్ మెచ్చి యే దిచ్చినన్
దగు సీతం డటువంటి మేల్బిరుదముల్ దాల్పంగ ముమ్మాటికిన్

కలుగుఁగాక యితని కలఘుతరాయుష్య
మింకఁ గొన్నికృతుల నితఁ డొనర్చి
పేరు గాంచుఁగాక పేదతనము వీని
వంకఁ జూచుటకును జంకుఁగాక

ఆమయ మేదియొ యీతని
నేమెయి వేధించుచుండు నెఱుఁగుదు నది యీ
పై మాటుమడిగి సుఖియై
సేమమ్ముగ నేండ్లు నూఱు జీవించుఁ దమిన్

అప్పికట్ల పౌరులు కవియైన యితని
యెడలఁ జూపించినట్టి సత్కృతికి మెచ్చి
యితఁ డుపాసించు కవిత వారెల్లరకును
భద్రము లొసంగి యెపుడుఁ గాపాడుఁగాక!

# విద్వత్కవి

శ్రీ వేలూరి శివరామశాస్త్రి

శ్రీరస్తు సకల విద్యా
పారమ్యావాప్తిరస్తు బహుళారోగ్యా
సారో஽స్తు సుకవికిన్ సీ
తారామస్వామికిన్ గృతప్రజ్ఞునకున్

నీ సమ్మానము నేఁడు శారదకునున్ నేత్రోత్సవం, బెంతయున్
వాసిం గాంచిన యీ మహాకవిత కింటం బెండ్లి, విద్వత్తకున్
రాసక్రీడ, తెలుంగు నేలకు సపూర్వంబైన సంక్రాంతి, వి
ద్యాసంతోషితసర్వదిక్సుకవి ! సీతారామ విద్వత్కవీ !

నీ సమ్మానము చక్కఁ జూచికొనఁగా నే నోఁచుకోలేదు కా
నీ సౌఖ్యావహమైన నీ మహము నే నిచ్చోటనే యుండి నా
వ్యాసంగంబుల నన్ని మానుకొని యుద్యద్భావనాచక్షుర
ధ్యాసం గాంచుచునుందు డెందమున సీతారామకవ్యగ్రణీ !

# మాన్యకవీంద్రా!

శ్రీ త్రిపురనేని రామస్వామి చౌదరి

తెలుఁగు నుడికార మెసఁగన్
దెలుఁగు కవిత్వంబుఁ జెప్పి, దిట్టతనమునన్
దెలుఁ గనిపించెదవో తు
మ్మల సీతారామమూర్తి ! మాన్యకవీంద్రా !

కమ్మ కులములో జనియించి కలముఁ బట్టి
కయితఁ జెప్పుచు నుంటి వఖండశక్తి
వెఱవక "కలాదపి హలాదపి" యని తిరుగ
వైచి భాషావిరోధుల బారిసమరు

శివకవులవలె రచింపుచుఁ
గవితాసంపత్తిచేతఁ గావ్యచయంబున్
సివమెక్కింపఁగ నేర్తువు
చవినిం జూపించి యెట్టి చతురుల కైనన్

వ్రాయ నేర్తువు ప్రౌఢప్రబంధ కవుల
దారిఁ దెలుఁగు భాషా సంప్రదాయ మెఱిఁగి
యుడుకునెత్తుటి పాటల నోలలాడి
రాష్ట్రగానంబుఁ జేతువు ప్రతిదినమ్ము

కవివై సందులకున్ నీ
కవితా నైపుణ్యమెల్లఁ గాదనకుండన్
భవదీయకులోద్ధరణకు
నవశ్య ముపయోగపఱప న్యాయము కాదే !

# మిత్ర ప్రశంస

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

జిలుగున్ మువ్వల శారదాచరణమంజీరస్వనాభోగముల్
తొలి మైనాకసహోదరీవిమలపాథోరమ్యముల్ తావి పూ
వులకున్ బుట్టినయిండ్లు నీదు కవనంబుల్ సాధుగేయా! సితో
పలవాగ్జాలవిధేయ! తుమ్మలసుధావారాశిచంద్రోదయా!

ఇతరుల్ తా రొక వేయిమంది సఖులై యేతెంచినన్ గాదు, స
న్మతి నీయట్టిఁ డొకండు శత్రు వయినన్ సాఫల్యమా నట్టి నీ
వితరాప్రాప్యసఖత్వభావమున న న్నెంతేని మన్నింతు వా
హితమే వందకు వంద సాధుజనసాహిత్యంబు న న్నందెనన్

సాధుశీలంబు శారదాసదనవదన
మమృతహాసంబు నార్యమర్యాద దీర్ఘ
మైన తనువును సత్కులమందు జనువు
నొక పురాజన్మసుతపఃఫలోద్గమములు

అభినవ తిక్కన భూతము
ప్రభూతసుకవిత విమర్శపథము న భూతో
న భవిష్యతి మంచితనము
సభశ్చరుల కైన నుండునా నిను బోలెన్

# మిత్ర ప్రశంస

ఇంతయు లేదు సాక్ష్య మెవ డిచ్చెనొ యెవ్వని కిచ్చినాఁడొ కా
లాంతరమందునన్ బసిడియచ్చు లొసంగెను నీదు తండ్రి, ఆ
యెంతటి నీతి నిన్ను వరియించుట యబ్రము కాదు హేమపుం
గాంతియ వచ్చి నీ కవితఁ గాచుట చూడు మె దెట్లు వచ్చునో!

ఘనులో పండితులో ధరాపతులొ మూకల్ మూకలై యుందురే
జనసంఘంబులు వారితోడ జరుగున్ సంబంధ మా దోష మె
ల్ల నహో నీదగు తోడిదాఁ జెలిమి పాలార్చున్ సుధాముగ్ధమో
హానహాసస్ఫుట సాధువాక్య పరిణామా! సీతరామా! సఖా!

## సూక్తినిధి

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి

సత్కవికి మిత్రునకు రస
వత్కృతికర్తకు బుధాభివందితునకు మీ
సత్కార యత్న మెంతే
నుత్కని గావించె నన్ను నుచితం బగుటన్

గాంధిచరిత్ర మే నమృతఖాద్యముగాఁ జవిగొందు నందు మ
ద్బంధువు సీతరామకవి పల్కుల పొంకము కూర్పు తీర్పు నా
గాంధి పవిత్రభావ పరికల్పన మేల్మికి మేల్మిపైఁడికిన్
గంధము సబ్బుఁ జేసిన ప్రకారమునన్ సమకూర్చె వహ్వారే !

మన చౌదరి భావామృత
ఘనాఘనము సూక్తినిధి యఖండాయుస్సౌ
ఖ్యనిదానంబై సత్కృతు
లనవరతముఁ గూర్చుఁగాత మందునుగాతన్

కవిత చింతపండుగాదు, మామిడిపండు
గాదు, కాదు వెండి, కాదు పైఁడి
అమృతధార, రేడియము, భగవంతుఁడున్
వలె సుదుర్లభంపు వస్తు వదియు

అది యకృత్రిమమై దివ్యమై పవిత్ర
మై శివేతరక్షతికరమై పరార్థ
సాధకంబై రహించు నా సత్పదార్థ
మబ్బినతఁ డార్షసంపద ప్రబ్బినతఁడు

# మాతీక్షన

శ్రీ ఏటుకూరి వేంకటనరసయ్య

నీ కవితాలతాంగి పయనించిన తెల్గుబయళ్ళలోన నా
జూకులు విజ్జిరాలినవి సు మ్మఖిలాంధ్రకవీంద్రకోటిలో
నీకు లభించు గౌరవము నిస్తుల మా కవితామహత్వ మా
పాకపటుత్వ మా సరసభావమృదుత్వ మదెట్లు లబ్బెనో?

నన్నయ చిన్నయాది కవినాథుల పోకడ లుగ్గడించుచో
అన్నము నీళుల న్మఱతు వద్యతనాంధ్రకవిత్వసత్వసం
పన్నుల గారవింతు విటువంటి సుధీజనపక్షపాతమే
మెన్ని యుగాల దాఁకఁ దపియించిన లభ్యపడున్ ? మహాకవీ!

కమ్మని కావ్య మల్లు కవిగాఁ డెవడైన సవా లొనర్చి మా
తుమ్మల వారి యాత్మకథతోఁ దులఁదూఁగెడు జాను తెన్గు క
బ్బమ్ము రచింపలేఁ డనెను వాదొకఁ డున్నది అక్షరాల ని
క్కమ్మది గాక నీ కలము కమ్మఁదన మ్మటఁ జిమ్మరేఁగెనో?

లోకము నూపునెత్తుగడలోఁ గల దంద మిఁకందులోన నీ
పోకడ వేరు, భావనకుఁ బూనితివా ? అసమాన కల్పనో
త్సేక కథల్ బయల్పడు, రచించితివా ? స్థిరకీర్తికారక
శ్రీకము లిద్ధకావ్యరసశిల్పము లుట్టిపడున్ గ్రమమ్ముగన్

గగ్గోలెత్తిన దాంధ్రమండలము "పక్కా" రాష్ట్రగానంబుచే
"దిగ్గాం" ధీరులు నేఁడు కన్దెఱచి ప్రీతింగూరి బంగారపుం
బగ్గీ పంపిరి యెక్కవయ్య కవితాపట్టాభిషేకార్థమై
సిగ్గుంజెందెద వేల ? నూత్నకవితా శృంగార శ్రీనాథుఁడా !

నీ కావ్యమ్ములఁ బట్టి చూతు మనినన్ నిర్వీర్యశబ్దమ్ము లే
దా కాకు న్దిలకింప నెందు స్వవచోవ్యాఘాతము ల్లేవు జ
ల్పాకుల్ వాకొన నేమి? నీ కృతు లమూల్యవ్యాసభాండారముల్
కాక ల్దేరిన గ్రంథకర్తవు సుమా కావూరి గ్రామీణుఁడా !

శ్రీమత్సింహపురీ జయంతి వినుతశ్రీఖండనీరాజన
వ్యామోహవ్యవహారధీరమధురవ్యాహార సందర్భముల్
మా మాగాణుల మ్రోఁగునాఁడు నిను సన్మానింప లేరైరి కా
నీ! మా తిక్కన కజ్జ మైతి వని సందేశించె దిగ్వ్యూహముల్

అవనీనాథుల సత్కృతుల్ పడసి కయ్యాలాడఁగా బూజ్యువా
కవు లున్నా; రది లెస్సగాదు ప్రజ సత్కారమ్ము లిట్లొందు వాఁ
డెవఁడో వాఁడె కవీంద్రుఁ డాతనిదె ప్రత్యేకత్వ మీరోజు మీ
కవితాపూజ ప్రజాదరమ్మునకుఁ దార్కాణమ్ము ముమ్మాటికిన్

ప్రేమకథ రచించి పింగళి సూరన్న
తండ్రి పేర నంకిత మ్మొనర్చె
తండ్రి ధర్మగాథఁ ద్రవ్వి మిత్రునితల
కెత్తినాఁడ వెవ్వ రిద్ధమతులో ?

నీ కావ్యలక్ష్మి పెండిలి
కీ కానుక లంపినాఁడ నిరువాఁగులకున్
ఈ కరణి గౌరవాదిక
మాకల్ప మ్మొసక మెసఁగు నాంధ్రావనిలో

# వలపు కానుక

శ్రీ జి. రాఘవ

సీతారామకవీ! పరి
పూతంబగు నీకలానఁ బొడమిన కవితా
జ్యోతి మనోహర మగుచుం బ్ర
భాతము సంధించెఁ దెల్గువనవాటికలన్

ఆలాపించిన రాష్ట్రగీతములయం దాంధ్రాభిమానం బహో
జ్జ్వాలై పాఱె, ఫలింపఁజేసినది భాషాస్వర్ణకేదారమున్
బాలంబోలిన యార్లగడ్డకులముం బాలించు భూపాలు ని
ల్లాలై, నీ కృతి శోభఁగూరుచు వయస్యా! నీ సుధాసూక్తికిన్

నన్నయ తిక్కనాది కవినాథులు త్రొక్కిన త్రోవద్రొక్క, యు
త్పన్న మొనర్చినావు రసవత్కృతు లెన్నియొ వంకలేని నీ
చన్నపథంబులో నడుగు సాగుట దుస్తర మిట్టి నీ కళా
భ్యున్నతి మెచ్చదగ్గది, సహోదరసత్కవిలోకభూషణా!

చలపలి ధరణీశుల దృ
క్కుల చల్లందనము నందుకొన్నది నీ ని
ర్మల వాక్కు, కొదువ లే దిఁక
పలుకుము కావ్యములు మధురభావస్ఫూర్తిన్

మెత్తని నీ హృదయమువలె
మెత్తని కవనంబు నీది, మెత్తఁదనములోఁ
గత్తికివలె పదనున్నది
సత్తాగలవాఁడవన్న! చౌదరిమిన్నా!

# తెన్గు 'జాతి' కవి

శ్రీ విశ్వనాథ వేంకటేశ్వరులు

ఏ మధుకోశ మూరిన మహీయసము మాధురధురంబో నీ కవి
త్వామృత మా భవద్ధృదయతామరసప్రియపత్రపీఠిపై
సామిదరస్మితస్ఫురణ సౌమ్య సుశీల సమత్వమూర్తివై
గోము వహించు నప్పరమగోపతి నిన్ను భరించు నిచ్చలున్

కవితల్ వ్రాయగవచ్చు భావములు కుల్కన్ జొక్కమా బాసలో
మివులం గ్రొత్తలు పల్కుముత్తెములు మేల్మేల్తీరులంగూర్చి వా
చవు లూరింపను వచ్చుఁగాని విమలస్వచ్ఛందచాంద్రీప్రభా
పరిణంబైన భవన్మనశ్శశికలాప్రాగ్భారముల్ వచ్చునే?

నీవల రాష్ట్రగానమును నిర్మల వాక్కథనావధాన రే
ఖావిధిఁ దెల్గు 'జాతి' రుచి గ్రమ్మితి వాత్మకథాసుధార్ద్రి వా
క్కేవధివాచు 'భారతవిశిష్టపదంబును జూఱఁగొంటి వాం
ధ్రావని భారతావని కృతార్థము లయ్యెను నీదు పుట్టుకన్

ఒక్కవిజాతిభావమును నొక్కవిజాతిపదంబు లేని నీ
చక్కనికైత, లోవెలిని జల్లని ధర్మమయంపుజ్యోతివై
యిక్కలిదోషసంహతుల నేర్చుత నింట వెలుంగు దీధితిన్
మిక్కిలికంటె మేటిదొర మెచ్చెడుఁ గార్తిక దీపవైఖరిన్

మాయన్న సఖుఁడ వీ వన
పాయుఁడ నాయనకు నేను బాంధవబంధ
శ్రీయుక్తి మనకు మాతృ
శ్రేయోవహ కావ్యలక్ష్మి సిరు లందిచ్చున్

# మన్ననపాడిక తోడవు

శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రి.

ధీరా! తుమ్మలవంశపు
వారాశికిఁ దొవలవింద! ప్రతిభాసిధి! నీ
తారామమూర్తి చౌదరి!
ఆ రాముం డొసఁగు నీకు ఆరోగ్యాదుల్!

"ఆత్మకథ" పండితుల మెప్పు లందఁగ రస
సంతమా పద్యపాళితో వ్రాయఁగలిగి
మన్ననలు గన్న నీకు సన్మాన మిపుడు
జరుగ సత్కవులకు మోదకరముకాదె?

ఆంధ్రదేశాభిమాన మొప్పార "రాష్ట్ర
గానము"ను పద్యరత్నాలు కలయఁగూర్చి.
తోడి దేశాభిమానుల తోడవుగాఁగ
కాన్క యిడితి తదాత్మలు కరఁగి పొంగ

కవితతోడుత వినయంబు కలదు నీకు;
అదియె ఎల్లర గౌరవ మందఁజేయు;
అట్టి సుగుణంబుతో ఎంతొ అలరు నిన్ను
అందఱుఁ గౌరవించుట అబ్బురంబె!

ఆయురారోగ్యభాగ్యంబు లతిశయిల్లి
తెలుఁగువారలు డెందంబు లలరి రాష్ట్ర
మును గడించు దీక్షను పూని పనియొనర్పఁ
జేయు మేల్పత్త్రములను వ్రాసెదవుగాక!

ఇట్టి నీ * పాడికలతోడ విచ్చు కాన్క
నీదు మేలెన్నడును తన నెమ్మనమునఁ
కోరు నెచ్చెలి నిన్నోరుల్ గౌరవించు
సమయమున మెచ్చి, మా. రామచంద్రశాస్త్రి

* పాడిక = పద్యము.

## కవి కుంజర!

శ్రీ కొసరాజు రాఘవయ్యచౌదరి

ప్రాచీనకవుల ఫక్కిని
తూచాలను దప్పకుండ దుమికింతువు అ
ర్వాచీన కవుల శైలిని
తూచి ప్రయోగింతు వీవు తుమ్మల సుకవీ !

తెలుగుం బాసకుఁ దీరుతీయముల దిద్దె న్నీ కవిత్వమ్ము వె
న్నెల జల్లుల్ గురియించె నీ యలఘుపాండిత్యప్రకర్షమ్ము మే
ల్కొలుపుల్ వాడి తెలుంగుజాతి నిమురన్ బోగొట్టె నీబోధ తు
మ్మలవంశాగ్రణి! ఆంధ్రపుత్రికులు సన్మానింప రాణింపుమా ?

చల్లని చల్లపల్లి దొరసన్నిధి నీ కవితాకుమారి ఘల్
ఘల్లున నందియల్ మొరయ గంతులు వెట్టుచు ముద్దుసూప మా
పల్లెటి సీమపౌరజనభావము లుబ్బటలూగ మెచ్చులన్
కొల్లగొనంగదయ్య కవికుంజర! తుమ్మలవంశవర్ధనా !

# కవివరేణ్యా !

శ్రీ ఇనగంటి పున్నయ్యచౌదరి

ఉభయభాషాప్రవీణోత్తీర్ణ విస్తీర్ణ ఘనయశశ్చంద్రికాకాంతి వెలుఁగ
ధారాప్రవాహగంభీరభావప్రౌఢ కవితాలతాచమత్కార మెసఁగ
శాస్త్రాంతరార్థవిస్తారసాక్షాత్కారశిక్షణోపాధ్యాయ దీక్ష లలర
చాకచక్యాధిక్యచాతుర్యలసితైక్యసద్వాక్యమాణిక్యసమితి మెరయ

ప్రతిభఁ జెందితి విరజాజి పరిమళంపుఁ
గమ్మకస్తూరి తావులు గ్రుమ్మరించు
గ్రంథములఁ జేసి ప్రఖ్యాతిఁ గాంచినావు
రూఢికెక్కిన సత్కవీంద్రుఁడవు నీవు

నిత్యకల్యాణవిభవంబు నీగృహంబు
పచ్చతోరణ మౌను నీ ప్రాపకంబు
కామధేనువు నీ చెంతఁ గాఁపురంబు
అమృతభాండంబు నీ హృదయాంతరంబు

పున్గు జవ్వాజి కప్పురంబులను దూలి పచ్చగులాబీలఁ బాఱఁద్రోలి
ఘనసారచందనాగురుగంధములఁ గేరి సంపెంగపూవులజాడ మీఱి
పనసరసాలసంపదల జోలలు పాడి చెంగల్వపువ్వులచెల్మి పీడి
జుంటితేనియజున్ను సొబగు దూరము ద్రోసి మాలతీఫలములఁ గేలిజేసి

నీకవిత్వంబు పండు వెన్నెలలు గాయు
నిండు జాబిల్లి జల్లు పన్నీటితేట
ముంచితేల్చిన యపరంజి ముద్ద బళిరె
అక్షరాల నిజమ్ము నేనన్నమాట

## అభినవతిక్కన సన్మానసంచిక

నిగనిగల్ జిగిమించు నిద్దంపుచీరపై బంగారు జలతారుపైట జార
సొంపైన ముత్తెంబు చుక్కలరవికెపై వాలుకీల్జడ వల్లెవాటు మీర
రంగారు నీలంపువుంగురుల్ నునుపైన చెక్కిళ్ల సెజ్జకు జీరువార
తళుకుబెళ్కులతోడఁదనరారుపాలిండ్లు మెడనూలుపై కెక్కి మేలమాడ

మొదటి వేల్పును ముద్దాడు చదువులమ్మ
చెలఁగి నీకలమందున నిలువకున్న
వ్రాయగలవాకొక్క కమ్మని పద్దెములను
అందగల వాక్క తిక్కన యనెడు బిరుదు

విద్యాప్రసూతికి వెలలేని సౌకర్య మిడు రాజరాజనరేంద్రవరుఁడు
కవితాకుమారిని గారాబమునఁ బెంచి ముద్దాడుచుండెడి భోజరాజు
కావ్యకన్యకు నలంకారంబు లెన్నియో చేయించగల కృష్ణరాయఘనుడు
పాండిత్యయువతికిఁ బరిణయం బొనరించి ఆశీస్సు లిడు వేంకటాద్రి విభుఁడు

లేని కొఱఁతను సవరించి లేశమైన
సంశయము లేక పోషించు సత్కవులను
ప్రాజ్ఞుడైనట్టి మన చల్లపల్లిరాజు
దివ్యగుణధుర్య ! అభినవ తిక్కనార్య !

## తుమ్మలాయన

శ్రీ ముసునూరి భాస్కరరావు

షోకుషోకైన బిరుదాలు నీకు లేవు
కలము నడిపించి పండితకవుల నోట
భేషు భేషు భళీ యనిపింప గలవు
తుమ్మలాయన! నీ వసాధ్యుడవు బాబు!

వ్రాసిన వ్రాతలో రసము వంచినఁ జిప్పిలు రీతిగా కృతుల్
చేసినవాడెవో! కవి; రుచిన్ పసలేనికవిత్వ మెందఱో
వ్రాసిరి పెక్కుపొత్తములు వారికి నీ కెటుపోటి! సత్కవీ!
మాసినబట్టతో వెలుఁగు మ్రాన్పడునా కనులున్న వారికిన్

భిన్నాభిన్నము లలఘువి
భిన్నమనస్కులకు పేర్లుపెట్టుట కొఱకై
యున్నవి, సత్కవితాఖని
వన్నన్నా! నిన్ను మెచ్చనా! అవితెక్కా?

తిన్నని భావముల్ తెలుగు తీరగు తీయము లొల్కఁ బోసి స
ట్లున్నది రాష్ట్రగాన మికనో మఱి ఆత్మకథన్ గణింప తి
క్కన్నగ నిల్చి నెగ్గి మొనగాం డ్రిడ నూట పదార్లు గొన్న పే
రెన్నికగన్న నిన్ను వెలయించుట లూరక నోటిమాటలా?

తెలియని వాఁ డెవండు నిను తెన్గున నేటి కవీంద్రకోటిలో
పల సుకవిత్వతత్త్వము సెబాసు సెబాసహ నీదటంచు తె
ల్గులు కల మూడుకోట్లు తల లూచిన నాడె దివాకరుండవై
వెలుగుట లొప్పనిప్పు డది వేఱుగ చెల్పుట నామమాత్రమే

# ఉపద

శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి

కమ్మనితావు జిమ్ము నొడికారపుఁ దీరు వెలార్చు కైత నీ
సొమ్ము; తెలుంగు బాస గడుసుదనముం దులకించు కూర్పు నీ
సొమ్ము; మఱుంగు మాటలకు సొంపుల నింపెడి మంచి నేర్పు నీ
సొమ్ము; వలంతి పోకడలఁ జొక్కఁగఁ జేసెడి క్రొత్తదారి నీ
సొమ్ము; నిజమ్ము దాఁపక రుచు ల్వెలయించెడి జాను పల్కు నీ
సొమ్ము; సనాతనాంధ్రకవి శుద్ధవచః పరిపాటికాపరీ
తమ్మగు కైత రీతులకుఁ దావలమై తగు నీదు కబ్బపున్
సొమ్ములఁ దెల్గుభారతికి సూడిద లిచ్చుచునుంటివి; విట్టి నీ
కిమ్మెయి నాల్గుమాట లెవియేని రచించి "యుపాయనమ్ము చే
కొమ్ము వయస్యరత్న" యని గొప్పకు నీయఁగ లజ్జపుట్టుఁ ద
ధ్యమ్మిది నీ కవిత్వరచనాతిమహత్తయు నీ సుహృత్తయున్
నెమ్మది సమ్ముదంబున గణించుచు నుండెద 'నాంధ్రి' నీ సుకా
వ్యమ్ములు కంఠభూషలుగ నాదటఁ దాలిచెఁ బెక్కులేల యీ
కమ్మకులంబు నీ కతన గౌరవ మింతకు మిన్నగాంచు నో
తమ్ములవంశ నీరధి విధూదయ! బంధురభావవాఙ్మయా!

## అభినవ తిక్కన్న

ప్రమోదు సంఖ్య.... శ్రీ మెడబల్లిమి సూరయ్య

చలువల్ గ్రమ్మెడి పూవుజప్పరపు పజ్జన్ గన్నెతోఁటంగాఁ తా
వులలో వెన్నెల జల్లునందు మురిపెంబుల్ చూపి తారాడుచుం
దల సూపెన్ భవదీయమైన కృతి సీతారామమూర్తి రస
జ్ఞుల కట్టాకలు పెట్టి నీకలము నాజూకేమి చిత్రించెనో.

తిక్కన శైలిలో మెఱుఁగుదేఱి సజావుగఁ దెల్గుతోఁటలోఁ
జక్కఁగ జాలువాఱి విరజాజుల పొత్తున మోసులెత్తి నీ
చిక్కనికైత మా హృదయసీమల వెన్నెల గాయుచుండెఁగా
దిక్కుదిబాసి లేని కృతిఁ దీర్చెదు మాకును మీకు సాటియా ?

ముద్దుగ ముద్దుగన్ బసిఁడి ముద్దలు రాయలు పంచునాఁడు నీ
నిద్దపుఁ గైత కల్గునెడ నీటుగ బంగరుమేడ గట్టి పె
న్నుద్దిగ నెన్నకుండుదురె యో కవిశేఖర ! కమ్మజాతికే
కద్దనిపించినావు కద కమ్మదనంబు కవిత్వసంపదన్.

కమ్మని తేనె లూట దిగ గ్రమ్ము చిందఁగ గజ్జెగట్టి నృ
త్య మ్మొనరింప వాణి కవితల్లజు లబ్బురమంద రాష్ట్రగా
నమ్మును దీర్చి చల్లపలి నాయికగా సవరించినావు ని
క్కమ్మగు మైత్రితోఁ బసిఁడి కాన్కల కాస వహింపకే కవీ !

నిగ్గుల్ దేఱిన విశ్వమోహన కళల్ నీప్రజ్ఞలో లీనమై
పగ్గెల్ గుల్కెడు నీకలమ్ము చిలుకున్ బంగారుఁబ్రాల్ ముగ్గుపై
మొగ్గం జూచు నెవండు నీయెదుట నీ ముత్యాల కావ్యంబుకై
యొగ్గెన్ దోసిలి యాంధ్రలోక మిఁక మా యూహల్ ఫలించెన్గదా !

జానుఁదెనుంగుకు న్మెఱుఁగుఁజాయలు దిద్ది రసోత్కటంబుగాఁ
దేనెల ముంచియెత్తె మును తిక్కన; దానికి వన్నె పెట్టఁగాఁ
బూనెను నీ కలంబు కవిపుంగవ! నీ నయగారి పోకడల్
సానలఁ దీరు వజ్రముల సౌరును దిద్ది మెఱుంగుఁ బెట్టెడిన్.

కమ్మని నీదుపోకడలు కౌముదిరేఖలలోన లీనమై
చిమ్మెను బచ్చితేనె రససిద్ధుఁడ వౌదువు నీదు కల్పనల్
గమ్మనిపించి తెల్గునుడికారములోని పసందు జూపెరా!
తుమ్మల వంశజా! పసిఁడితోఁ దులతూఁగుయుగమ్ము పోయెరా!

చికిలీచేసిన నీ కలంబు మెఱుఁగో సింగారము ల్గుల్కు నా
త్మకథన్ సృష్టి యొనర్చి విశ్వజన సన్మానార్హ సంపత్తితోఁ
గకుబంతంబుల కెక్కి వన్నె గనె పక్కా పాదుపాశీవులన్
బెట్టుచు నీదు మార్గములు వాగ్దేవిం బ్రతిష్ఠిఁ

కృతి రాష్ట్రగాన మఁట, కృతి
పతి రసికుఁడు చల్లపల్లి ప్రభు వఁట యిఁక నీ
కృతి యాకృతి కే లోటీ
క్షితితలమున నుండు టరిది సీతారామా!

నభలకు నెక్కఁజాలు కవిసత్తము లెందరు లేరు వారు వా
గ్వైభవము గల్గి తిక్కన కవిత్వము మచ్చుకు జూపి నీవలెన్
అభినవతిక్కనాఖ్య గనిరా! రసవార్ధుల నీదులాడిరా!
ప్రభువుల నాశ్రయించు కవిపంక్తికి నీ కృతు లందబోవునా!

# కవిసన్మానము

శ్రీ బూదూరు రామానుజులు రెడ్డి

ఆంధ్రమాతృ గర్భశుక్తిముక్తాఫల మనఁదగు ఉభయ భాషా ప్రవీణ తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారి సారస్వత నందనోద్యాన మున వికసించి సుమసౌరభముల నెగఁజిమ్ముచుండెడి "రామశతకము" "రామలింగేశ్వరశతకము" "మహాత్మాగాంధి తారావళి" "నామదేవ చరిత్రము" "ఆత్మకథ" "ఆత్మార్పణము" "రాష్ట్రగాన"మాదిగాఁగల గ్రంథప్రసూనములతోఁ బదునేడువత్సరములుగ నాకేర్పడిన పరిచయ మును నా యదృష్టములలో నొక్కటిగ భావించుచున్నాడను.

కరుణరస భరితమైన ఖండకావ్యములలో మిన్న యని వాసి గాంచిన "ఆత్మార్పణము" స్వీయకథావిధానముతోఁగూడిన పద్య కావ్యములలో సాటిలేని దని విఖ్యాతి నార్జించిన "ఆత్మకథ"లతోఁ బాటు మూఁడుకోట్లకుఁ బైపడిన ఆంధ్రుల సర్వతోముఖాభివృద్ధికై యొక ప్రత్యేకరాష్ట్ర మావశ్యకమని యాందోళన సల్పువారిలో నగ్ర గణ్యులై తమ హృదయావేదనను తత్సంకల్ప సిద్ధికై వినియోగించుచు ఆలాపించిన శ్రీ సీతారామమూర్తి చౌదరిగారి "రాష్ట్రగానము" అఖిలాంధ్రజన సమ్మోహనమై ఆంధ్రజగతి సారస్వత జీవితమునం దతి గణనీయమై అలరారుచున్నది.

శ్రీ చౌదరిగారు నేటి ఆంధ్రపండిత వర్గమునందు అగ్రస్థానమును వహింపఁగలిగిన సమర్థులు. ధారాశుద్ధితోను, పదలాలిత్యముతోను, రసగాంభీర్యముతోను, మనోహరములును, నర్థవంతములును నగు జాతీయావేశ ప్రబోధములతోను వీరి కవిత్వ మలరారుచుండును. అట్టి

సుప్రసిద్ధ పండిత కవిపుంగలును, భాషాసేవా దీక్షాదక్షులును నయిన శ్రీ సీతారామమూర్తి చౌదరిగారికి "కవిసన్మానము" గావింప సమకట్టి "రాష్ట్రగానము"ను తత్కృతిభర్త లగు శ్రీ శ్రీ శ్రీ చల్లపల్లి సంస్థానాధీశ్వరులు శ్రీ యార్లగడ్డ శివరామ ప్రసాద్ బహద్దరువారికి కృతి సమర్పణ మొనర్చెడి మహోత్సవమును నిర్వహించుటకు పూనికొని తమ్మేఁ దా గౌరవించుకొనిన గుంటూరు మండలాంతర్గత అప్పికట్ల గ్రామప్రాంతీయ ప్రజల భాషాభిమాన నైచక్షణ్యము శ్లాఘాపాత్రమై యొప్పుచున్నది.

పండితప్రకాండు లగు శ్రీ సీతారామమూర్తి చౌదరిగారు ఇతోధికములగు దేశ, భాషాసేవలఁ జేయుచు, తెలుఁగుసీమకు ఉపకృతి సాధనముగ వెలయుచు, పరిపూర్ణారోగ్యైశ్వర్య సంపదలఁ జెన్నలరారుచు చిరంజీవియై వర్ధిల్లుగాత మని యీ శుభసమయమున శ్రియఃపతి నర్థించుచున్నాడను.

# కవ్యాగ్రణీ!

శ్రీ జమ్మలమడక రామమూర్తి

శ్రీమద్భారతి భారతీయకవిరాడ్జిహ్వాగ్ర సంచారి ని
స్సీమ జ్ఞానకళా ప్రకాశిత మహచ్చిద్రూపి నిత్యంబుఁ దా
నోముం దుమ్మలవంశపావనుని స్వీయోపాసనాలబ్ధ స
త్ప్రామాణ్యస్వకవిత్వ వైభవుని సీతారామ ధీమన్మణిన్.

కమ్మఁదనమ్ము మత్కులముఖమ్మునఁ బోలె వెలార్తు నా కవి
త్వమ్మునఁ గూడ సంచుఁ బరువమ్ముగ "నాత్మకథన్" వచించి నీ
మమ్మును నిల్పుకొన్న బుధమాన్యుఁడు సత్కవితాసనాథుఁ డీ
తుమ్మల "మూర్తి" సత్కృతులతోఁ దులఁదూఁగునె యన్యకావ్యముల్.

ఇతివృత్తంబు పవిత్రసంఘటనమయ్యెన్ నాయకుం డన్న సూ
నృత నిష్ఠాపరతంత్రుఁ డా జనకుఁ డయ్యెన్ లోటిఁ కేముండు? దు
ర్మత ఘోరాంధతమస్సు వోనడఁచి "ధర్మజ్యోతి" పైఁబై భవ
త్ప్రతిభం జాటుచుఁగాదె లోకమున సీతారామ కవ్యాగ్రణీ!

మా రాష్ట్రం బని మాదు భాష యని మా మర్యాద మా జాతియం
చారాటం బొక యింతలేక స్వజనం బల్లాడఁ గన్నీరు ము
న్నీరై పాఱఁ దపించు తన్మయతలోనే "రాష్ట్రగానంబు" నూ
ఱూరం జాటె తెలుంగు జోదుల మనం బుఱ్ఱూత లూఁగింపవే!

ఏ సదుద్యమ మెటఁ దలయెత్తెనేనిఁ
గదిసి సుస్వాగతం బిచ్చు గ్రామ మగుట
సుకవిసన్మాన వైభవాత్మకము దీన
సగ్రతాంబూల మందె మా అప్పికట్ల!

# కవికులతిలకా!

శ్రీ కోగంటి దుర్గా మల్లికార్జునరావు

సన్మానముఁ బడయుట గత
జన్మమునన్ బుణ్య మెంతొ సలిపినఁ గలుగున్
సన్మానింపఁ బడుదు వన
మన్మానస మతిముదబ్ధిమగ్నం బయ్యెన్.

ఆంధ్రులకు రాష్ట్ర మొదవమి
యాంధ్రుల కవమతి యటంచు నారసి మదిలో
నాంధ్రమున రాష్ట్ర గానము
నాంధ్రుల మేల్కొల్ప వ్రాసి తహహా యనఁగన్.

కమ్మని నీ కవితాపా
కమ్మును రుచిచూచినట్టి కవివర రసనా
గ్ర మ్మింకఁ గోర దే పా
కమ్మయిన, నిది నిజమ్ము కవికులతిలకా!

కరి నెక్కుదువో లేదో
కరి నెక్కిన నెక్కకున్నఁ గరము దలంపన్
గరి నెక్కిన వారలతో
సరిగావే? రామమూర్తి చౌదరి! సుకవీ!

# అభినవ తిక్కన

శ్రీ అబ్బరాజు వీరరాఘవయ్య
శ్రీ అబ్బరాజు సూర్యనారాయణ
(ఆదిపూడి సోదర కవులు)

మీకవితా సుధాసరిదమేయతరంగమడోల నెక్కి ప
ల్లోఁకల నందు నందుఁ దలమున్కలు వెట్టుచుఁ బారవశ్యమున్
మేకొను రాజహంసలను మేమవుటన్ ముఖసంస్తవాపవా
దాకలనంబు మానుడుల నంట దొకింతయు సత్కవీశ్వరా!

హలివై నాఁడు రచించితీవరయఁ గావ్యంబుల్ రసోదంచితం
బులు వాణీకరకంకణ క్వణనదంబుల్ భావదీపంబు లు
జ్జ్వలభక్తి ప్రచుర ప్రసారములు శబ్దస్ఫూర్తి విస్ఫారముల్
దళితాఘంబులు పోతనార్యగతి సీతారామ విద్వత్కవీ!

ప్రానుడికారపుం బిగువు వాయని కూరుపు తిక్కనార్యుఁడే
జాను తెనుంగుబాస సరసంబుగ సంతన సేసె నట్టిదా
పూనికిఁ గబ్బముల్ పలికి మోదము గూర్చి తెలుంగు వారిచేఁ
గానుక లంద నేర్చితివి కైసరులం దలమానికంబవై.

మొల్లల నేర్చి కూర్చినటు ముత్తెపుఁ దేఁటల నీటుటింగి రం
జిల్లు సరంబు లల్లినటు సృష్టికినిం బ్రతిసృష్టి సేసిన
ట్లుల్లము పల్లవించు మధురోక్తులతోఁ గవితోపహారముల్
పెల్లుగఁబంచి క్రొంబరువు వెన్నెల గాచితి వాంధ్రవీధులన్.

## అభినవతిక్కన సన్మానసంచిక

సరస సంస్కృత సమాస రచనాప్రాగల్భ్య మొలికింతు నన్నియ పలికినట్లు
అలఁతి యలంతి పల్కుల నర్థగౌరవ మొదవింతు తిక్కన్న పొదివి నట్లు
కమనీయ గాథాప్రకల్పనా చాతుర్య మడరింతు సూరన్న నుడివినట్లు
ప్రౌఢప్రయోగప్రభావవైచిత్రి కూర్చెదు రామకృష్ణుండు చెప్పినట్లు

శబ్దసంస్కృతి నవ్యరస ప్రయుక్తి
యర్థసంపుష్టి హృద్యభావానుయుక్తి
నీదు స్వర్ణలేఖినిలోన నెగడుచుండు
పుణ్యమూర్తి సీతారామమూర్తి సుకవి.

తిక్కనవోలెఁ గైతగణుతింపఁగఁ జెప్పఁగలాఁ డెవండు నీ
వాక్కుఁడ వాంధ్రభారతి శుభోదరమం దుదయంబునొంది యా
ఫక్కిని 'గాంధియాత్మకథ' వ్రాసితి సింహపురీ సభాంతరం
బెక్కితి వారునూరుల గ్రహించితి కొంటివి తిక్కనాంకముల్.

అభినవతిక్కనార్య బిరుదాంకము నేటి సభాంతరంబునన్
విభుల సమక్షమందు సుకవి ప్రకరంబుల ముందు సాహితీ
ప్రభుత వెలర్ప నీ రుచిరబాహువునందు ధరింపఁ జేసిమే
మభినుతు లప్పనం బిడుదు మందికొనంగదవయ్య చాదరీ!

తలిరుల పల్కులన్ వగరుదార్కొను మవ్వపుఁబెల్లు దిద్దుచున్
దలకొని యేఁచి యాంధ్రకవితా కమనీయ రసాలశాఖపైఁ
గొలువిడుచున్ గుహూనినదగుంభన శోభిత రాష్ట్రగానముల్
వెలుఁగులమై గగుర్పొడువ నింపిన కోకిల వీవు సత్కవీ !

## అభినవ తిక్కన

నవనీత ప్రతిమాన మానగుణతానందాభికందంబు ధీ
రవిచారాతిచిరత్నరత్నవిలసద్రత్నాకరం బాధ్యస
త్కవివంద్యంబు నుదాత్తనాయకవిశుద్ధం బిద్ధతేజంబు నీ
కవితాకార్యము సర్వతోముఖసమాక్రాంతంబు విద్వత్కవీ.

నీ జనకుండు నారయ మనీషివరుండు విశిష్టచేష్టిత
భ్రాజిత కీర్తిమంతుఁడగు వాని తపఃఫలమ్మై జనించి ధీ
పూజితచారితుండ వయి భూపసభాంతరలబ్ధ సద్యశో
రాజివినై యెసంగెదు నిరంతర సత్కవితా ప్రసంగివై.

నారయ ధర్మజ్యోతిని
బారము ముట్టంగఁ జదువువారలు ముదకూ
పార విలోల మనంబుల
సారెకుఁ దన్నామజపము సలుపరె సుకవీ.

వంగడమ్మునఁ బల్కుల భావగతులఁ
గమ్మఁదన మది వెల్లువల్ గట్టుచుండ
సుస్థిరాయురారోగ్య లక్ష్ముల వహించి
యాంధ్రభారతి జోహారు లందికొనుము.

"తులసీ చౌదరి ! నీ మనోహర కృతి స్తోమంబు వాగ్దేవతా
కలగుంజన్మణినూపురాన్వితపదాగ్రన్యాసితద్యోధునీ
సలిలోద్భూత వివర్ణ పుష్పచయమై సర్వాంధ్ర భూమిన్ సిజో
జ్జ్వల శోభాసురభీ విభాసితముగాఁ జల్పెన్ బ్రమోదింపుమీ!

తన వచోగరిమమువిని రాజరాజేంద్రుఁ డాస్థానమునకు రమ్మన్ననాఁడు
తనరచనావిదగ్ధతఁ జూచి మన్మభూపతి"మామ"యనితన్నుఁబలుకునాఁడు
తన కవితాధారలను దోఁగియొకిమాఁటు కొసరిబంగరుతలంగురియునాఁడు
తన నవీనతకు మెచ్చి నృపుండు చేతితోఁ బల్లకీ కోపులు పట్టునాఁడు

న్నపార్యుండు యజ్వ శ్రీనాథ సుకవి
పెద్దన మనీషి మోద మే పాటి గనిరో
అంతటి ముదంబు నీవును నందు సఖుఁడ
చల్లపల్లీశ్వరుఁడు మెచ్చు సమయమందు.

"సమకాలంబున వారు మెచ్చ"రని వెచ్చంబుచ్చె నిట్టూర్పు లొ
క్క మహాసత్కవి; నీవు సర్వకవి లోక ప్రాజ్య సమ్మాన ము
త్తమతం గొంటివి; నీ కవిత్వమును వైదగ్ధ్యంబు ముమ్మాటికిన్
సమహత్త్వంబగుఁగాదె? చౌదరి గుణాంచత్కావ్యకృద్వైఖరీ!

# ప్రజ్ఞాశాలి

శ్రీ ప్రతాప వేంకటేశ్వర కవి.

వింటిని నీ కవిత్వమును వీనుల విందుగ లో ముదమ్ము గై
కొంటిని పండితోత్తములకున్ దలమానికమైన నిన్ను నే
గంటిని నిండుకొన్న కుతుకమ్మును గంటి నికన్ సుకావ్యముల్
దంటతనాన నిట్టులనె తామరతంపరగాగ వ్రాయుమా!

భార మటంచు నెంచ కనవద్యసుపద్యములన్ మనోజ్ఞ మా
ధారను గాంధిజీవిత ముదారమతిన్ లిఖియించి దేశమం
దార భవత్ప్రతిష్ఠ నఖిలాశలఁ బాదుకొనంగఁ జేయు నీ
నేరుపు నేర్పుగాక కవినేతల గీతలఁ బల్కు నేటికిన్.

ఏరాజన్యులొ నూరులారులను నెన్నోసారు లీయంగ సు
శ్రీ రంజిల్లెదవంచుఁ జెప్పనలెనే! రేకెత్తు నీకైత వి
స్తారోదార యశంబు గూర్చుటకు ప్రజ్ఞాశాలి; యీపైన నీ
కారోగ్యమ్మును సర్వదా యొసగ నే నర్థింతు సర్వేశ్వరున్.

పుడమిన్ ప్రౌఢులు సత్కవీశ్వరులు నిన్ బూజింప నిప్పట్ల నే
నుడుతాభక్తిని వీనిఁ బంపితిని ఎట్లో వీని మన్నింపు మీ
జడధిన్ దాటితి వీవుగూడ సుమనీషన్ సత్కవిత్వంపు సం
దడిచే, తుమ్మల వంశవార్ధిశశి సీతారామమూర్తీ! కవీ!

# అపరతిక్కనగారి అపరంజికలము

శ్రీ తుమ్మల రాఘవయ్య

తిక్కనార్యునితోడ దివికేగనా యనుకొంటి. సహగమనము సర్వశ్రేయోదాయకమా యను శంక వొడమె. కాదని ఆత్మ గుంకిళ్లు వెట్టె. సరియ. ఆంధ్రావనిం గలయం దిరిగితిం దిరిగితి. పుణ్యాంగణంబుల నెన్నిటినో మెట్టితి. ఏండ్లును బూండ్లును గడచిపోయె. కడకు నా నోము ఫలియించె. కాపూరి పొలిమేరం గాలిడంగనే మనసులో నది యేమొ మరులువుట్టె. అప్పటికీ కవిగారు "ఆత్మార్పణము" సేయు తలపు వలపునం బక్కవాటుగం బైరగాలికిం బూజొంపముల క్రింద మోచేతిమోపున నఱచేతం జెక్కిలి నిడి యాలోచనామగ్నులై యుండ నా యాజానుబాహువులు, ఆ పోతమీసలు, ఆ ముక్కుకోటేరు, ఆ స్ఫురద్రూపము, అద్దిరయ్య ! ఇక నా మనసు పట్టలా. పోయి చట్టునం దళతళలాడు ఊటకలముగ మారి నా నెలవుం జేరి నేడుగా ధన్యభాగ్య నయితి నని అక్కునం దలం జేర్చితి.

అట్టె "ఆత్మార్పణము" చేసి "భారతోర్విలో వెలయు శిలయు నతిథి సేవాపరాయణం బగును గాదె" యని భారతహృదయమును లోకంబునకు గ్రుచ్చి యెత్తి చూపితి.

లక్షల తరబడి వత్సరంబుల నుండి వచ్చు విపుల భారతేతిహాసంపు టిరువదియవ శతాబ్దపుం బేరమీది కేంద్రచిత్రము గాంధిజీ చరిత్రము "సెప్పాట జగద్ధితం బయిన నేతగాదె !" యనుకొని "ఆత్మకథ" లిఖయించితి. "నా పసిడిగంటమా ! నీ వపరతిక్కనగారి అపరంజికలమ

వైతివా'' యని ఆ స్వర్లోక తిక్కన సంతోష సంభ్ర మాశ్చర్యములఁ దనపేర నాకు "ఈనాము'' ఇప్పించె.

"పురిటిగడ్డ" నుద్ధరించి ఇంట నీఁగల మ్రోత నీగింపలేకున్న బయటఁ బల్లకి నెక్కు భాగ్యంబు గల్గునే యని "దీక్షంబూనితి నాంధ్ర రాష్ట్రమును సాధింపన్ దదీయ క్రియారక్షం జేసెద నెట్టి కష్టమయి నన్ రానిమ్ము కానిమ్ము'' అని "రాష్ట్రగాన'' మాలపించితి. చల్లపల్లీ శ్వరు ముద్దుటల్లునిగఁ జేసికొంటి.

దుమ్ముఁ గొన్న మాణిక్యాల దులిపి యెత్తుట మేలి కర్జంబని తలంచి "మంటికడవ నులకమంచంబు పూరిల్లు నూలిచీర రత్నకీలితంబు గాని పైఁడితొడవు'' లేక వెల్గిన ధనదపురంబును గొనియాడితి. కన కంబుపై నాశవోని మావారి తండ్రిగారిని కొండాడకుంట తగవా?

అబ్బా, దీని యెత్తుగడలు, హుందాతనము, నడక తీవి అనన్య సామాన్యమోయీ అని యీ అప్పికట్ల వారు నా కవితాధారకు సన్మాన మను "అప్పకట్ట" వైచిరి. ఇక నా యూట కడ్డుండరాదని ఈ ధన్యాత్ముల తలపోత, అందఱి అభిమతము కాబోలు. ఇఁకనయిన నీ ప్రవాహజలశీకరముల చెమ్మచే నిదఁ దూగు "కావూరమ్మ''కు కనువిప్పు కాఁగలదని తలంతు. "ఆంధ్రభాషా వికాసము'' "ఆంధ్ర సాహిత్య చరిత్రము'' నా పాలి సొమ్ములు కావలయు ననియు, నా మెఱ పెల్లకాలము చెక్కుచెదరకుండవలె ననియు అందఱి హృద యాలు నినదించుచున్నవి గదా!

# నీకు సాటి యెవరు?

శ్రీ కేసనపల్లి లక్ష్మణకవి.

నీతిజ్ఞత్వమునందు నేమి సుజనస్నేహమ్మునం దేమి ధీ
చాతుర్యంబున నేమి సర్వసమతా సంపత్తియం దేమి ప్ర
ఖ్యాతిం గంటివి నీకు సాటి యెవరింకన్ నీ మహత్వంబు నీ
సీతారామయనామమే తెలిపెడున్ సిద్ధంబు తద్జ్ఞాళికిన్.

ఈ నీవు తుమ్మలాన్వయుఁ
డైనకతన నేమొ కవితయం దితరకవీ
శానులలో ములుసూపితి
శ్రీ నిరుపమ కీర్తిధామ! సీతారామా!

పాకమ్మృదుత్వమున్ లలిత భావసమగ్రిత కూర్పు నేర్పు నా
నా కమనీయ శబ్ద కలనమ్ముల పడసిన పుష్టిఁ దుష్టిగా
నీకవనమ్మునం గలవు నీ కవనమ్ము కరమ్ము రమ్యమై
నాకవనమ్మువోలె సుమనః ప్రియమున్ ఘటియించు నెంతయున్.

## కవిపుంగవుఁడు

శ్రీ దూపాటి కొండమాచార్యులు.

కమ్మని తేనె లొల్కు నుడికారము భావసమృద్ధిగల్గి యో
గ్యమ్మయి పండితాగ్రిణు లహో యని మెచ్చ విశుద్ధ సత్కవి
త్వమ్ము నెసంగఁజేసి వసుధాస్థలి శాశ్వతకీర్తిఁ గాంచె నీ
తుమ్మలవంశవార్ధిశశితో సము లెన్నగ లేరు నేఁ డెటన్.

అఖిల సద్గుణ సంపన్న మైనకతనఁ
దగినవరుఁ డబ్బె నీకవితాకుమారి
కభిమతార్థంబు సిద్ధించె నగుట మాకు
నిండుమోదంబు సమకూరె నెమ్మనమున.

గడపితి మొక్కయేఁడు వెనుకన్ మన మప్పుడు భావపట్నమం
దుడుగని ప్రేమతోడ విభవోజ్జ్వలమైన భవత్కవిత్వ మిం
పడరగ వింటి నెంతయు ముదన్విత చిత్తుఁడనైతి మిత్రమా!
పుడమిని నిన్నుఁ బోలు కవిపుంగవుజన్మము ధన్యమే సుమీ!

సరససత్కావ్యభూషణ సంచయంబు
నెలమి భాషావధూటి కర్పించి మించి
శాశ్వతానందమున మనశ్శాంతి నెసఁగి
వఱల గదవయ్య మిత్ర! యీశ్వరుని కృపను.

# కవిరాజశేఖరా!

శ్రీ దేవినేని సూరయ్య

శ్రీరమ్య తుమ్మలకుల
క్షీరాంబుధి చంద్ర! శేముషీరుంద్ర! నమ
స్కారము లివె గొనుమో నీ
తారామకవీంద్ర విమలతరగుణ సాంద్రా!

శ్రీమంతః బిరుదమ్ము సార్థకముగాఁ జెన్నొందు భూపాల సు
త్రాముం డంతటి వానికిం గృతి మహోద్యల్లీల నర్పించి యి
బ్భూమిః ధన్యత గన్నవాడ వికఁ నీ పుణ్యంబు నేమందుఁ బ్రో
ద్దామఖ్యాతి నహించి వర్ధిలుము సీతారామ విద్వన్మణీ !

రాష్ట్రగానమై యెవ్వాని రమ్యకీర్తి
రాజిలునో యట్టి శ్రీ శివరామనృపతి
కే యిపుడు రాష్ట్రగాన మర్పించి జన్మ
సార్థకముఁ జేసికొంటివో సత్కవీంద్ర!

పలుకులయందుఁ బ్రౌఢతయు భావవిలాసము సౌకుమార్య మ
త్యలఘుగుణంబులుం గలిగి యన్నివిధాలఁ బ్రసిద్ధిఁగన్న మీ
లలితపుఁ గావ్యకన్యల విలాసములం గనుఁగొన్న నేరికేః
వలపు జనింపకుండునె ధ్రువమ్ముగ నో కవిరాజశేఖరా !

# సత్కవీ!

శ్రీ యడ్లపల్లి దేవయ్య

పలుకు పలుకున మాధుర్య మొలుకఁ జేయు
రాష్ట్రగానాదు లం దనురాగముంచి
తెలుఁగు వారెల్ల రీనాడు తెగువఁ జేసి
గారవింపఁగ నుంటిరే ! కవివరేణ్య !

అఱవ పితలాటకంబుల నణఁచి పెట్టి
ప్రక్క వారలఁ జిందులు త్రొక్క జేసి
తెలుఁగు వారెల్లఁ గన్నులుఁ దెఱచునట్లు
రాష్ట్రగానంబు వెలసె నీ రాష్ట్రమందు

విమల విజ్ఞాన ధనముతో వెలయుచుండి
యమలమగు దేశభక్తితో నలరుచుండి
గానమును జేయు నీ రాష్ట్ర గానమునకు
నంజలి ఘటింప కుండునే ? యాంధ్ర జగతి

రాజనరేంద్రుండు రాజిల్లియున్నచో నగ్రహారములు నీ కబ్బకున్నె
మనుమసిద్ధినృపుండుమనియున్నచో తూగుటుయ్యాలలోన నిన్నూపకున్నె
అలకొండవీటి రాజులు నేడున్న నీ కెనలేని సంతోష మొసఁగ కున్నె
ఆంధ్ర భోజుఁడై యిప్పుడలరారియున్న నిన్ మత్తగజంబు పైకెత్త కున్నె

అంచితంబైన కీర్తి గడించి తెలుఁగు
శారదకు వన్నె తెచ్చిన జగతివిభులు
కటకటా ! దాటిపోయిన కాలమందు
నేల పుట్టితివో సత్కవీశ నీవు!

ఒక్కసన్మాన మదియొక లెక్కగాదు
భారమైనట్టి ఋణములోఁబడియె నాంధ్ర
దేశ; మేరీతి ఋణమును దీర్పగలదొ
నీదు సేవకు సత్కవీ! నిక్కమరయ

## తొలిపంక్తి కవి

శ్రీ చిరుమామిళ్ల శివరామకృష్ణప్రసాద్

శ్రీ సీతారామమూర్తి చౌదరిగారు ఉన్నతములైన ఆశయములతో చక్కని కవిత్వమును వ్రాయగల పండితులు. ధారాశుద్ధికి వారి కవనము పుట్టినిల్లు. కవితాశక్తి, పాండితీపటిమ, వీరిలో ననితర తుల్యముగ మేళవించియున్నవి. వీరు పద్యములయందు ప్రాసను నిర్ణయించుకొనుటయందొక యొయారమును చూపుచున్నారు. వీరి యుత్పలమాల కొక ప్రత్యేకత యున్నది. వీరు పండితకవు లగుటచే వీరి పద్యగమనమునం దంత జిగి కుదిరినది. పాండిత్యములేని ధారాశుద్ధి ఊబిగుంటలపై శకటగమనము వంటిది. ప్రాచీన కవిత్వమున కెనయైన రచనావైభవమును సంతరించుకొని శ్రీ చౌదరిగారు సర్వాంధ్ర వాఙ్మయమునందు తొలిపంక్తి కవులలో చేరుచున్నారని సగర్వముగ మనని చేయుచున్నాను.

## సుకవి

శ్రీ బోడేపూడి వేంకటరావు

ఇమ్మహిఁ సాటి దేశములకెల్ల శిరోమణియై సుపుత్త్ర ర
త్నమ్ములఁగాంచి గౌరవపదంబున మించిన యాంధ్రమాత మా
తమ్ములవంశ సత్కవిని దాఁగలిప్రేమ తురంగలింప సౌ
ఖ్యమ్ము చిరాయురున్నతి నిరంతర కీర్తియుఁ గూర్చి ప్రోచుతన్

కోయిలకూతలో మధురగుంఫన కర్థముఁ జెప్పఁజాలు నీ
తీయని కూర్పునన్ గళలఁదేటి పురాతన గౌరవోన్నత
చ్ఛాయల సంతరించుకొనఁ జాలిన దాంధ్ర నితాంత మోద సం
ధాయకముల్ భవచ్చతురతాపరిపూర్ణ వచః ప్రసంగముల్

దిగ్దిగంతరములఁ దిండ్రించి వెలిఁగిన తెలుఁగురాజన్యుల దివ్యతేజ
మాఱుమూఁడైన మూఁడాఱైన సడలని యాంధ్రులకార్యదీక్షాభినిరతి
పాషాణములకు జీవము వోయఁజాలిన తెలుఁగుశిల్పులకళా విలసనమ్ము
అమృతవీచుల లోకమాప్లావ మొనరించు నాంధ్రకవిప్రతి భాతిశయము

అవసరంబగు సంతకు నాహరించి
మూసలో ననిదంపూర్వమూర్తిఁ జేసి
రాష్ట్రగానంబు గావించు ప్రాజ్ఞసుకవి!
ధన్యతమజీవితమ్ము తథ్యమ్ము నీది

సరసగుణాలవాల విలసన్నవభావవిశాల సంతతా
దరకలితప్రచారవిబుధస్తుతిపాత్రవిశిష్టభావనా
కర భవదీయకావ్యమయకన్యక సర్వగుణానురూపుడౌ
వరునెదఁజేరి గౌరవసభాజనమై చరితార్థయై తగున్

దేవరకోట ధాత్రీకాంత బంగారు కడుపు సార్థకముగాఁ గన్నకొడుకు
ఆంధ్రరాష్ట్ర స్థాపనాచార్య బిరుదంబుఁ గైకొనఁజాలు దీక్షాపరుండు
కవివాక్యముల కాత్మకర్మయశోలతల్ ప్రాకింప నేర్చు వివేకశాలి
కలితలోకానందకల్యాణగుణముల కాశ్రయంబొసఁగు మహాశయుండు
అత్యుదారచరిత్రుం డనంతవిభవుఁ
డిద్ధతేజుండు చల్లపల్లీశ్వరుండు
ప్రేమ మిం పెసలారఁ బరిగ్రహించె
నీదుకృతికన్యగరిమ మెన్నికకుఁ దగదె

భావమునకుఁ దగిన పదసౌష్ఠవంబును
శబ్దముల శయించు సరసభావ
మొనరఁగూర్చి సూరిజనమానసంబులు
కొల్లగొట్టి పేరుగొంటి వౌర

రాజనరేంద్రు సామ్రాజ్యకాలంబున గడియించిన యఖండగౌరవంబు
మనుమసిద్ధిక్షమామండను కొలువులో లీలఁ గాంచిన రతనాలపూజ
దక్షిణాధీశుముత్యాలశాలను ఠీవి ననుభవించిన కనకాభిషేక
మలకృష్ణరాయభూతలనాథుమన్ననం బ్రోదిగాంచు గజోత్సవాదికములు

భావమునఁ దలపించు సువర్ణయుగపు
జాడ లొక కొన్ని దృష్టిగోచరము లయ్యె
అందుకొను మింకఁ బ్రాగ్గౌరవాతిశయము
నాంధ్ర కవితామతల్లి ! సుస్వాగతమ్ము

# ప్రశంస

శ్రీ చింతలపూడి శేషగిరిరావు

పెంచితి పెద్దఁజేసితివి ప్రేమ సలంకరణాదులన్ని య
భ్యంచితరీతిఁ గూర్చితివి వ్యాప్తివహించె గుణాదు లెల్లెడన్
మించెను భాగ్యరేఖ యిఁకమీఁదట రాజులఁ జెట్టపట్టి ద
క్కించును గౌరవంబు సుఖయించును నీ కృతికన్య సత్కవీ!

కమ్మకులావతంసుఁడవు గావుట నీ కవనమ్ము కబ్బె నీ
కమ్మదనంబు మిత్రమ! యగాధము నీదు స్వరాష్ట్రవాంఛ దై
వ మ్మొకనాఁడు రాష్ట్ర మిడ స్వర్ణమయాక్షరపంక్తి నీదు నా
మమ్ము లిఖింపఁజేతురుసుమా మన యాంధ్రచరిత్రమందునన్

పూర్వ మెప్పుడో తిక్కన పూర్వపుణ్య
వశముసంజేసి పిలువంగఁ బడియె మనుమ
సిద్ధిచే మామ యనుచుఁ బ్రసిద్ధభంగి
మరల 'చలపల్లి' నిన్ను మామా యనండె.

ఆపద లెల్లమాన్చి ఘనమైన పదంబుల నెల్లఁ బూన్చి సం
తాపము వీటఁ బుచ్చి సతతంబు ననామయ మిచ్చి యెయ్యెడన్
బాపము లెల్లఁ దూల్చి కడు భావగభీరతఁ దార్చి నీకు ల
క్ష్మీపతి కూర్చుఁగావుత మమేయకవిత్వమహత్త్వసంపదల్

శ్వశురజామాత లిద్వరు సత్వరాంధ్ర
రాష్ట్రవాంఛాపరత్వ విరాజమాను
లిపువురున్ దాతలును సంగ్రహీతలైరి
యింత తుల్యసంబంధ మింకెందుఁ గలదు

## మిత్రోక్తి

శ్రీ పిశుపాటి నారాయణశాస్త్రి

ఆసేతు హిమాచలముగ
భాసించు భవత్కవిత్వ భంగిమ; లోక యాం
ధ్రీ సన్నిధి నన నేటికి
శ్రీ సీతారామమూర్తి! శ్రేయస్ఫూర్తీ!

కమ్మనితావితీవినవకమ్మల జల్లుగఁ జల్లుమల్లియల్
'గి' మ్మన నీక మానితపుఁ గీరితి పూరితిగా గడించు బే
రమ్మన నారి తేటె నచిరమ్మగ నీ కవితాప్రచారముల్
తుమ్మల వంశవారిధి విధూ! యఘునాతనసత్కవీశ్వరా

నివురు గప్పిన పెనుచంద్రనిప్పువోలె
నోజ చెడి కాలవశమున నొదిగియున్న
తెలుఁగు తేజమ్ము తటితోడ వెలువరించి
పాఠకుం డూఁగ గ్రంథస్థపఱచి తౌర!

వన్నెచిన్నెల గడితేటి వాసిగన్న
యన్నమిన్న నీలేఖిని కన్నబిడ్డ
వలచి వలపించి చలపల్లి వసుమతీశు
రసికుఁ జేపట్టె నుభయతారకము గాదె?

ధన్యగుణభరితము చరితమ్ము మాడ్కి
గణ్యకవిమాననీయ మహా కయిత పోల్కిఁ
గలుగుఁగాక యారోగ్యభాగ్యమ్ము గూడ
నీకు సర్వేశ్వరుని కృపాలోకమునను

# కీర్తిసౌందర్యి!

కవిశేఖర శ్రీ మన్నవ నరసింహము

పలుకుల్ ముద్దుల మూట గట్టవలె, నాపై భావగాంభీర్యమిం
పలరం దెల్పిన సత్కవిత్వ మదియా, నన్నట్టు మీ కైతయం
దలి భావోన్నతి పల్కు తేనియలచేతన్ శ్రోత్రపేయమ్ముగాఁ
దలఁపం జెల్లును సత్కవీంద్రులకు సీతారామ విద్వన్మణీ!

తెలుఁగుం గైతను మెచ్చి మున్ హృదయ పీఠిన్ నమ్మి పోషించిరాం
ధ్రులు, నా నాఁటికిఁ బ్రాసముల్ యతుల నున్మూలించు కాలంబు సం
ధిలె నివ్వేళల శాస్త్రసిద్ధ మగు రీతిం గావ్యముల్ గూర్పఁ గాఁ
గల నీకున్ జగదీశ్వరుండు చిరసౌఖ్యం బిచ్చి రక్షించుతన్

తెలుఁగునకుం గల ఠీవియుఁ
దెలుఁగుం గవితకు గలట్టి తేఁకువయును నా
తెలుఁగుం బిడ్డల విధి తు
మ్మల సీతారాము కృతులు మాటికిఁ జాటెన్

వ్యర్థోక్తు లుచ్చరింపమిఁ గావ్యమెల్ల సద్రచనా ధురంధరతను వహించె
నీరసవాక్యముల్ నింపమి గ్రంథవితతి నెల్లెడ స్సరసత లభించె
దుష్టోక్తు లొక్కింత తోఁపమిఁ జరితముల్ కవితాపటుత్వసంకలనఁ జెలఁగె
అన్యదేశీయంబు లబ్బమిఁ గబ్బముల్ మాతృభాషా ప్రౌఢమార్గ మూనె

ఔర రచనాచమత్కృతియందు సరస
వైఖరిని ప్రౌఢదశఁ బటుత్వమున నీదు
కవిత కవిలోకమున కింపుగా నటించె
కీర్తిసాంద్ర! సీతారామమూర్తి సుకవి!

కులములతోడ బాసయును గూలుట మేలఁట రెండుఁగూలఁగా
గల దఁట రాజ్య మిట్లు పలుకంగలకాలము మూల మాటచే
నిలువదు తెల్గుబాసయని నిక్క మెఱింగియు మాతృభాషకుఁ
నెలవుఘటింపఁగూర్చితివి నేర్పుగ సత్కవి! రాష్ట్రగానముఁ

## కవిమూర్ధన్యా!

శ్రీ కొడాలి చక్రపాణి

నీవర్తనమ్మురీతిగ
పావనములు నీదుకృతులు బళిబళి! కవులం
దేవాఁడు నిన్ను మించును?
కావూరుపురీనివాస! కవిమూర్ధన్యా!

# కేల్మోడ్పు

శ్రీ లేళ్ళ వేంకటరామారావు

కమ్మకులోద్భాసి యనన్
తుమ్మలవంశమునఁ బుట్టి తోరపు యశమున్
జిమ్మిన సీతారామున
కిమ్ముగఁ గేల్మోడ్తు దేశికేంద్రున కర్థిన్

తెల్గులవెల్గుఁ జిమ్ము కవి తిక్కన చేతికలమ్ము పోకడల్
గల్గిన మేలికైతలను గమ్మఁదనమ్మును జూపి కాన్కలన్
వెల్గిన వన్నెకాఁడవు కవీంద్రుఁడ తిక్కన లేని లోపముల్
కల్గఁగనీక మా తెలుఁగుగడ్డను గాచితి వో కవిప్రభూ!

ఉల్లము పల్లవింప విమలోజ్జ్వలభావము దొగ్గు కైతజా
బిల్లివెలుంగు వెల్లువల విచ్చిన తామరకన్నె మొగ్గలై
చెల్లిన నీదు కావ్యములఁ జిందెడు తెల్గుల నీటు; నీ కృతుల్
మల్లెలు మొల్లలై తనరె మాన్యచరిత్రకు నాంధ్రలక్ష్మికిన్

పల్లకికొమ్ము భూపతులు పట్టి భుజాగ్రమునందు నిల్పనాఁ
డల్లదినమ్ముల న్వెలిఁగి హాయిగ నూయెల జోలపాటలం
దొళ్ళను మర్చి తియ్యని రసోక్తులఁ బ్రొద్దులు పుచ్చినట్టి పో
కిళ్ళను గుల్కుభారతి సుకీర్తిని మిమ్ములఁ బోల్చుఁగావుతన్

సద్ధర్మరతుల ప్రశాంతగుణము పల్కు
"నాత్మకథ" పసిండియందె కాఁగ
ఆపన్నరక్షణకై నెయ్యమును జూపు
"నాత్మార్పణము" హృదయంబు కాఁగ
మాతాపితలమీఁది మన్నన దెల్పు
"ధర్మజ్యోతి" నేత్రయుగ్మంబు కాఁగ
పొలివోని తెల్గువీరుల కడిమిని జాటు
"రాష్ట్రగానము" మేలిరథము కాఁగ
తెల్గుమాగాణి పొలిమేర వెల్గులొత్త
కాంతు లీనుచు మీ యశోగానములను
జాటుచున్నది భారతి సంతసమున
సరసకవిలోకగణ్య! మద్గురువరేణ్య!

# మధుర కవి

శ్రీ నారు నాగనార్య

శ్రీ తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారి చెలికారము చాల కాలము క్రిందటనే నాకు లభించినది. నాఁటినుండి నేఁటివఱ కవిచ్ఛిన్న తైలధార వలె మా స్నేహము విద్యావ్యాసంగమునఁ బెంపెసలారుటచే వారికిం గల సహజ సద్గుణ సంపదయు, నిరవధిక జాతీయాభిమానమును, నిరుపమాన రసవత్కవితా పట్టభద్రతయు నే నెఱుంగుదు.

తెలుఁగున కున్న మెత్తందన మెల్ల నేర్చి కూర్చి తీర్చి దిద్దినట్టు లాంధ్రత్వ ముట్టిపడ్డట్లు పలుకుపోకడలందు సయితము వెలువరించుట యన వీరి కభ్యాసము కూసువిద్దె వంటిదే. మృదుల హృదయము, మధురభావము, మనోహరరచన లన్ననో జన్మహక్కులం బోలి వెంబడించిన వనవచ్చును. మిత్రతావాప్తికై పాటుపడుటందు వీరి ప్రసన్న హృదయ మెంతేనిఁ బ్రశంసింపఁ దగినది సుమా! మఱి జాతీయాభిమాన మన్ననో? వీరి కుగ్గుపాల పోఁతతోఁ దంగని కుదురుకొని కరుడుగట్టినది సరిగదా? కట్టు, బొట్టు, జుట్టు, కాసంతయేనిఁ గనుగందని యాంధ్రత్వమే యివ్వాని పాలిటి కీలువేల్పు. ఏతత్కళారాధనమునకై జీవితసర్వస్వ మర్పింపఁ దలపెట్టిన యోధుఁ డీ మహాభాగుఁడు. మూర్తీభవించిన యాంధ్రత్వమే వీరి యుపాస్యదైవము. జాతీయత చౌదరిగారి వలె రూపెత్తినదని పల్కుట యతిశయోక్తి కాదుగదా! ఇఁకఁ బ్రకృతాంశము విచారించిన ఈనాఁడు నవకవులు, యువకవులు, బాలకవులు, భావకవులు కడకు వృద్ధకవులవఱకుఁ గల పలు తెఱంగుల కవులందఱు ఏ తెగకుఁ జేరినవారా యని శతధా సహస్రధా

యోజించిన ఆకున గంటమున అందిపొందనట్లు ముందుకు సాగిపోవు చున్నారే! కాదు, కాదు, వెనుకకే, ఎట్లు? ప్రాక్తన కవికుటుంబము లలో నిచ్చిపుచ్చుకొన్నట్లు జిగిబిగి వ్రాఁతలలోఁ జేతితడియారని కమ్మందనము నిజకులమ్మునకువలె నిమ్మధురకవికి పెట్టనిసొమ్మనియే నమ్మెద.

శ్రీనాథపెద్దనార్యుల కవితావినోదము లీ కవిగారికి మనుఁగుడు పుల వంటివే యగును. అంతియేకాదు. తద్రచనలను కమ్మచ్చున నొండొండ తీసిన బిగితంపు తీఁగల బాగునఁ బొల్చుఁగదా! వీరికవితా విలాసములు. "కవిర్హి మధుహస్తయః" అనురీతి హస్త పద్మము నుండి కవితామధుస్రవంతిని స్రవింపఁజేసెఁ గాబోలు. అటుగానిచోఁ బాఠక లోకమునకు వీరిరచనలు గనినంతనే వినినంతనే యొడలు పులకరించి యొకవిధమైన భావప్రసన్నత యొకవిధమైన హృదయవికాసము ఒక విధమైన ఆనందసంధానము గలిగించునా? "సర్వేషాం భూతానాం మధుః" అనుశ్రుత్యుక్తి రిత్థయగునా? కచాకచి కైతలలో వీరికిఁగల పలుకుబడి యపారమని నా యూహ! ఎట్లన సింహపురి పండితపరి షత్తున "తిక్కన బహుమానము" సంపాదించు విషయ మొక్కటే యుదాహరణముగాఁ గొనిన జాలును! పెక్కులేల? ఆంధ్రలోకమునకుఁ జేతికాన్కవలె నంది యిచ్చిన రాష్ట్రగానము రాష్ట్ర ప్రాప్త్యనంతర మున సయితము గానము సేయఁదగిన దను విషయము మఱువరానిది. శ్రీ మహాత్ముని "ఆత్మకథ" నాఁదగు సత్యకథ ననువదించు భాగ్య మీ యోగ్యుని కబ్బుట కబ్బినబ్బబ్బ సందుచున్నాఁడను. "కవి ఋతస్య పద్మభిః" అనునట్లు కవి సత్యార్థమునకుఁ గట్టిన యశ్వముగదా! సత్య

చరిత్ర మీ పూతచరిత్రుని హృదయమున కానందమ్ముం గూర్చ కెట్లు నిలచి నీరు ద్రావనిచ్చును.

ఇదియుంగాక, పశ్చిమాంధ్రప్రబోధమున రాయలసీమబిడ్డ వలెనే సాహసికగుణమునే ప్రకటించుటకు "ఆంధ్ర కవివీరునకు జే" యని యనవలసినదే! కానీ మఱొకసారి పశ్చిమాంధ్ర దేశసంచార మొనర్చి యటనటంగల పశ్చిమాంధ్ర సోదర సాహచర్యముం బడసి తదనుభూతివిభూతిచేఁ బశ్చిమాంధ్రప్రవాదముఁ గూర్చియో, పశ్చిమాంధ్ర ప్రబోధముఁ గూర్చియో మఱికొన్ని శాస్త్రాలములఁ జేర్చి "కవయః సత్యద్రష్టారః" అను వాక్యమును సార్థకపఱతురు గాత మని ప్రార్థింపం బారి వేఁడికోలు.

ఆంగ్లభమాత కడుపారఁ గన్నబిడ్డయు మధుర కవితా ప్రగల్భుఁ డగు నీ మూర్తికవిగారికి యీ సదస్సునం గల పండితమండలి "మధురకవి" యను బిరుదమును ప్రసాదింపఁ దగునని వాంఛించుచున్నాఁడను. "మణినా వలయం వలయేన మణిః" అను విధమున నేతత్కాలానుగుణముగా సత్కవికి సముచితబిరుదసత్కారమును, సముచిత బిరుదమునకు సత్కవివతంసుఁడును సలంకారప్రాయులని నేఁటి లౌకిక పరిభాష.

# సన్నుతి

శ్రీ ఉప్పల కోటయ్య

నన్నయ తిక్కనాది కవినాథ ప్రదర్శిత కావ్యపద్ధతిన్
సన్నుతిపాత్రమై పరగు సత్కవితల్ రచియించినావు భా
వోన్నతి మీఱంగా రసమయోక్తుల నర్థము సంఘటింప వి
ద్వన్నుత! నీదు జీవితము ధన్యము మాన్యము తెల్గుగడ్డపై

కట్టమంచి రెడ్డి కడుమంచి దని మెచ్చె
మా రేపల్లి శాస్త్రి మాయురే యనె
నిఖిలపండితులును నీ "యాత్మకథ" జూచి
వహ్వా రే యటంచు పలికినారు

తిక్కన కవిత్వమును జ్ఞప్తి దెచ్చునట్టి
మధుర భవదీయకవిత సమ్మదము గూర్ప
మన్మసిద్ధీశుపురిసుధీ మండలంబు
మెచ్చి నూటపదారుల నిచ్చె నౌర

రోసము వీడి జీవనము రోతకు లొంగి పరాయి వారికిన్
దోసిలి యొగ్గి దాస్యమతితో చరియించెడి తెల్గు జాతికిన్
రోసము గల్గజేసి మఱి సూక్ష్మమతిన్ నిజరాష్ట్రసిద్ధికిన్
మీసము ద్రిప్పి యత్నపడ మేల్కొలుపున్ గద మీ ప్రబోధముల్

కమ్మతన మొందు నొక్క వంశమ్మె గాదు
కమ్మదనమున వెలయు మీ కవితగూడ
దీప్తినందించె సుధయంబు తెనుఁగు నేల
ముదితహృదయ! సీతారామమూర్తిసుకవి!

# కవిసార్వభౌమ !

శ్రీ వల్లభనేని రామకృష్ణయ్యచౌదరి

శ్రీరాజిల్ల నరాతిసోదరుని బ్రార్థింపఁగఁజేపట్టి లం
కారాజ్యాధిపుఁజేసి భవ్యయశము న్గన్నట్టి సద్భక్తమం
దారుం డవ్యయమూర్తి సర్వజగదాధారుండు ధీరుండు నీ
తారాముం డనిశంబు బ్రోచు నిను సీతారామమూర్తిన్ గృపన్

తారకలందుఁ జంద్రుని విధంబున బాదపపఙ్క్తియందు మం
దారము రీతి సత్కవికదంబమునందు విభుండ వౌదు వో
ధార ! నుతింపగా నెవరికైన నసాధ్యము సుమ్ము సద్గుణో
దారభవత్పటుత్వలలితత్వపృథుత్వ కవిత్వసంపదన్

నిజపదమంజీర నినదంబు లెసగంగ బ్రకటసమాసాంబరంబు గ్రాల
కలితసుశబ్ద కంకణరాజి భాసిల్ల భావచాతుర్య సంపద వెలుంగ
ననదృశాలంకారహారాళు లెనయంగ భూరితరార్థ విభూతి యమర
కల్పనానల్ప సంకల్ప ప్రయుక్తమై యఖిలలక్షణశోభితాంగి యగుచు

నీముఖద్వారమున నుండి నిర్గమించి
నీయశంబును బాడుచు నేర్పుమీర
కలితగతుల స్వదేశరంగమున నాట్య
మాడుచున్నది త్వత్కవితాంధ్రవాణి

కలమునకు రైలుగమనం
బలవడగా వెన్కముందు లరయక వ్రాయం
గల శక్తి యుక్తి నీకే
గలదో కవిసార్వభౌమ కవితాపఙ్త్తుల్

పదలావణ్యముగల్గి వృత్తగుచ్ఛమై భావాను సంధానమై
సదలంకారవిభాసియై సుగుణభాస్వత్కంధియై సద్రసా
స్పదమై యక్షరచారురూపయుతమై సర్వార్థసంప్రాప్తమై
పొదలెన్ త్వత్కవితాసరస్వతి సుధీవ్యూహంబు మేల్మేలనన్

## నిర్దుష్టకవిత

శ్రీ నల్లపాటి బ్రహ్మానందశాస్త్రి

నీ కవితన్ జయించు కవినిన్ దిలకింపఁగఁబోము నీ కృతుల్
చేకొను గౌరవంబును విశిష్టత నేకృతి పొందఁబోదు నీ
పోకడలోని మార్దవము పొంకము నేకవి కందరాదు నీ
పాకము కాకవిందులకుఁ బట్టునె వేయిభవంబు లెత్తినన్

రసమును జిమ్ములాడి మధురం బగు శైలిని మోసులెత్తి యే
కసటునులేని నీ పసిఁడికావ్యము ముద్దులు మూటగట్టుచున్
మిసమిసలాడు వెన్నవలె మించి రసజ్ఞుల కెక్కఁజాలెరా
ముసురుకొనంగ రీతులు సమూలముగన్ మురిపెమ్ము చిమ్ముచున్

కమ్మని తెల్గు కవిత్వము
తుమ్మలవారికిని మేటి తోడనై కనఁగా
నిమ్మహిని దక్కెనని యన
యమ్మను జను లెన్నుచుందు రార్యచరిత్రా!

# ప్రౌఢ కవిత

శ్రీ గొ. రమాకాంతాచార్యులు

కవిచూడామణు లెంద ఱాంధ్రజననీగర్భంబునం బుట్టి స
త్కవితాగోష్ఠి యశంబు గాంచ? రెవరేఁగానీ, తదీయోజ్జ్వల
స్తవనీయప్రభఁ బాడిరే మధురవాచాప్రౌఢి నీ మాడ్కి? వా
స్తవ; మో తుమ్మలవంశవార్ధి శశి! సీతారామకవ్యగ్రణీ

సరసులలోఁ జరించిన రసజ్ఞుఁడ; వక్కలహంస లట్టు లి
య్యురుతర జీవనప్రదమునుండి సదా యమృతంబుఁ దీసి భూ
సురతతి కందియిచ్చిన యశోనిధి వట్టులుగాక యున్నచో
నరయఁగ శ్రీ మహాత్మ చరితామృతపూరము లింత యొప్పునే?

ఒక్కచో మ్రొక్కించు నున్నత హిమశైలశేఖర సీమంత సీమలందు
ఒక్కచోఁ జొక్కించు నుపనిష దుద్యాన ప్రజ్ఞాన ప్రసవసౌరభ్యములకు
ఒక్కచోఁ జిక్కించుఁ బ్రోద్దామశిల్పలీలా మోహనదృగంచలములయందు
ఒక్కచో నెక్కించు నుజ్జ్వలజాతీయశౌర్యార్జితము జయస్తంభచయము

ఆంధ్రవిజ్ఞాన గాథాసహస్రగాంగ
నిర్ఝర తరంగ సుస్నాన నిర్మలాత్మ
భాసమాన స్వమాతృదేశాభిమాని!
భావవీథుల భవదీయ ప్రౌఢకవిత

తిక్కన యెట్టివాఁడొ యని దీనత మే మిఁక దేవురింపఁగా
నక్కరలేదు నిన్నుఁ గని యా నుడికారము నీదు కావ్యపున్
ఫక్కిఁ బ్రతిధ్వనించెడిని; నన్నయ డాఁగురుమూఁతలాడు నీ
వాక్కుల, సంస్కృతాంధ్ర సమపాండితి యన్నను నీకుఁ జెల్లదే?

రసస్రత్రంబును బెట్టినా వటకు యాత్రల్ వత్తు మేమెల్ల; నీ
రసచిత్తుల్ బహుగ్రామ్యాపుం గృతులతో రంజిల్లని మ్మట్టిదః
ర్వ్యాసనం బొల్లము, యాత్మదఘ్న మగు బ్రహ్మానంద సబ్రహ్మచా
రి సుమీ కావ్యరసామృతంబు సుమనఃప్రీతిప్రదం బో కవీ!

## అపర తిక్కన

శ్రీ కొత్త భావయ్య చౌదరి

అమ్మనలె సొమ్ములుగాఁగల
కమ్మకులాబ్ధికి విధుండుఁ గవిశేఖరుఁడుం
దుమ్మల సీతారామయ
కిమ్మహితాతిథ్య మిచ్చు టింపగు గాదే?

ఆత్మార్పణముఁ వ్రాసి యంకిచ్చునాఁడె నీ కవితాధురీశక్తి గానబడియె
గాంధీమహాత్ముని కథరచించినతోడ నాంధ్రలోకం బెల్ల హర్ష మొందె
రాష్ట్రగానమున శౌర్య స్థైర్యముల గను దివ్యపరిబోధంబు తేటపడియె
అభినవతిక్కనయంచు నెల్లారున సత్కరించిననాఁడె చదలఁ బ్రాకె
నీదు సత్కావ్యరచనావినిర్మలతర
సాంద్రదివ్య యశోలత లాంధ్రభూమి
సాహితీ దివ్యవన పుష్ప సౌరభములఁ
బూతమగుచు సీతారామమూర్తిసుకవి

ధీయుతులైన వా రపరతిక్కన యంచు నుతించుచుండ నీ
ప్రాయమునందు నీకుఁ గల ప్రాభవమున్ గన మోదమయ్యె దీ
ర్ఘాయువుగల్గి కావ్యశత మబ్బుర మంద జనుల్ రచింపు సు
శ్రీయుతుఁ జేసి సౌఖ్యములఁ జెందఁగఁజేయు మహేశుఁడుం గృపన్

## కమ్మని కవిత

ప్రౌఢకవి: శ్రీ ముమ్మలనేని శివలింగయ్య

శ్రీకరు లాదిదంపతులు, చిన్మయరూపు లగణ్యపుణ్యు ల
స్తోకదయామయాత్మకులు, స్తోత్రపదీపరితృప్తమానసుల్,
లోకుల తల్లిదండ్రు లటు లోపము లెన్నక బ్రోచు నుత్తమ
శ్లోకులు, తుమ్మలాన్వయు నశోకునిగా నొనరింతు రెప్పుడున్

భాషా యోషా భూషలు,
శ్లేషార్థసమన్వితము లశేషప్రజాసం
తోషకరంబులు, సుందర
వేషాలంకృతులు, నీ వివేకమ్ము దూక్తుల్

కమ్మని కవితం జెప్పగ
తుమ్మల కవి రామమూర్తి తుల్యులు గలరే ?
కమ్మకులాభరణము జన
సమ్మతుడు, నమాయికుండు, సరసుడు గాడే

కాంచితి మిమ్ము గర్తపురిఁ గాంచితి కొల్లూరు పట్టణంబునన్
కాంచితి నీదు వాక్పటిమ గాంగఝరీసమవేగ వైభవో
దంచితమైన దాని, నరు దయ్యెడి నా కననేల, యెవ్వరేన్,
గాంచినయంత మేనిపులకల్ జనియింపక పోవు సత్కవీ !

వలయముచేత జాతిమణి వన్నియ కెక్కును, దానిచేతనే
వలయము పేరు గాంచు, జనవల్లభుడౌ శివరామభూపుడే
సలలిత కీర్తి, నీ కృతికి చక్కని భర్తగ లభ్య మాయె, నీ
యలఘుయశంబు, శాశ్వతమె యయ్యెను తుమ్మలవంశసత్కవీ !

## తేనెల కైత

శ్రీ షేక్ గాలిబ్

ఆంధ్ర వాఙ్మయమునం దత్యంతకృషి సల్పి
మంచి పాండిత్య మార్జించినావు
అమృతోపమానమై యలరారు వాగ్ఝరిఁ
గావ్యముల్ రచియింపఁగడఁగినావు
భారతావనిహర్ష వారాశిఁ దేలాడ
నాత్మకథను వ్రాసి యలరినావు
మకరందమాధురిఁ మరపించు నాత్మార్ప
ణం బొండు విరచించి నాఁడ నీవు

రాష్ట్రిగానామృత మురళీరవముచేత
సార ! మేల్కొల్పి తాంధ్రనాయకుల నెల్లఁ
గవిత నీపాలి గృహలక్ష్మి కవివరేణ్య !
కీర్తిసాంద్ర! సీతారామమూర్తిచంద్ర!

కమ్మకులావతంస! వినఁ గమ్మని వాగ్రచనావిలాసముల్
బమ్మెర పోతనాదికవివర్యులఁ బోలు కవిత్వసత్వముల్
సమ్మతి నీ కొసంగెఁ గృప శారద తుమ్మలవంశశేఖరా !
సొమ్మది నీదె సుమ్ము కవి సోదరబృందము హర్ష మందఁగన్

ఉభయభాషా ప్రవీణత నొందినావు
కండచక్కెర తేనెల కైతఁగూర్చి
కావ్యరచనాధురీణతఁ గాంచినావు
భావకవి కోటి కెల్ల మేల్బంతి వహహా!

# తుమ్మల వారి కవిత

శ్రీ కందేపు వెంకట్రామయ్య చౌదరి

ఈనాటి యుత్తమ కవులలో ప్రథమ స్థానమందు లెక్కింపదగిన శ్రీ తుమ్మల సీతారామమూర్తిగారి కవిత్వమును ప్రశంసించుటకు పూర్వము మన వాఙ్మయము, దానిపూర్వాపరములు తెలిసికొనుటకర్తవ్యాంశము. మనవాఙ్మయము నేటిదనుక నాలుగవస్థల బొందియున్నది. (1) అజ్ఞాతావస్థ, (2) పురాణప్రబంధావస్థ, (3) నాటకనవలావస్థ (4) నవ్యసాహిత్యావస్థ. పదునొకండవ శతాబ్దమునకుఁ బూర్వము ఆంధ్రభాషయందు గ్రంథము లున్నట్లు కానము. అందుచే నిది యజ్ఞాతావస్థగాఁ బరిగణింపదగు. తదుపరి పురాణ ప్రబంధావస్థయందు వ్యాసరచిత సంస్కృత భారత భాగవతములు శ్రీహర్షకృత నైషధాది గ్రంథము లెన్నో క్రమముగా కవ్యగ్రేసరులైన నన్నయ తిక్కన పోతన శ్రీనాథాది కవులచే నిర్దుష్టముగ నిరుపమానముగఁ దెనిగింపఁబడి నేటికి నజరామరములై యున్నవి. తదుపరి రాయల యాస్థాన దిగ్గజములచే మఱికొన్ని కల్పిత ప్రబంధరాజములు నిర్మింపఁబడి యీనాటివరకు మన తెలుగు భాషకు లాక్షణికసమ్మతమగు ప్రమాణ గ్రంథములుగాఁ బ్రకాశించుచున్నవి. ప్రస్తుతము నాటక నవలావస్థ పాశ్చాత్యసంపర్కముచే అట్టె విజృంభించి చూచుచుండగనే యిట్టె నశించుచున్నది. వెంటనే నవ్యసాహిత్యము శరవేగమున శతసహస్ర శీర్షికలతో ఖండకావ్యములు భావగీతికలు భావకవిత్వముగా బయలుదేరి పదిరెండణాల గ్రామ్యభాషాసేవఁజేయుచు ప్రచారితమగుచున్నది. కష్టసాధ్యంబగు పూర్వలక్షణగ్రంథ సమాలోకన కొల్లక కడకు అబ్బయ

నాయని వ్యాకరణమైన నవలోకింపక సులభసాధ్యమగు నేటి గ్రామ్య ముందే కావ్యనిర్మాణమున కియ్యకొని కొందఱు సంతృప్తు లగుచుండిరి.

ప్రస్తుత కవులలో ప్రాచీన కవుల పోడిమి పోకడలు గలవారు వ్రేళ్ళచివర లెక్కింప దగిన ట్లున్నారు. శ్రీతిరుపతి వేంకటేశ్వరులు శ్రీత్రిపురనేని రామస్వామి చౌదరిగారు, శ్రీవిశ్వనాథ సత్యనారాయణ గారు, మొదలగువారు. అందు మనతుమ్మలవారికి స్థానమిచ్చి తీరవలెను. లేనిచో నాంధ్రులు వారి భాషాసేవగు ర్తింపనివారు అగుదురు. అందు లకు వారి యుత్తమకావ్యరచనానైపుణ్యమే ప్రబల సాక్ష్యము. వారి గ్రంథములఁ జదువక పూర్వమే వారు నాకుఁ బరమమిత్రు లగుట సంభవించినది. భావపురియందు మే మొక్కచో రెండువత్సరములుగా నుంటఁజేసి వారి పాండిత్యప్రకర్షణ, వారి ప్రాచీనవ్యాకరణ సాంప్రదాయ ప్రయోగనైపుణ్యము పెల్లుగా గుర్తించినాడ. తదాది తత్కవికృత గ్రంథము లందుకొని నేటివరకు పలుసారులు పఠింతును. వారు రచించినవి నాలుగే నాలుగు పూజ్యగ్రంథములు. 'ఆత్మార్పణము' 'ఆత్మకథ' 'రాష్ట్రగానము' 'ధర్మజ్యోతి.' గ్రంథ విస్తరభీతిచే నొక్కొక్కదాని ప్రాశస్త్యము నుగ్గడింపఁబూనక స్థాలీపులాకన్యాయముగ నా తెలిసిన యంతవట్టు చెప్పఁబూనినాడ. ఇప్పట్టున ఆంగ్లకవిశేఖరుఁ డగు రస్కిన్ నుడివినట్లు గ్రంథజాలమును గడియగ్రంథములు శాశ్వతగ్రంథములుగా విభాగింపనగు. ఘడియ గ్రంథముల ప్రయోజనము క్షణికము, తాత్కా లికము. కేవల ముబుసుపోక కుపకరించునవి. మఱి శాశ్వతగ్రంథము లన్ననో వాని ప్రయోజనము శాశ్వత సౌభాగ్యము. "విశ్వశ్రేయః కావ్యం" అను రీతి లోకకల్యాణమున కాస్పదమగు మనచౌదరిగారి

గ్రంథములు శాశ్వతకావ్యములలోఁ జేర్పనగును. ప్రతిపద్యము నాతి కఠినమై, రసాత్మకమై, రమణీయ శబ్ద ప్రతిపాదనచే నొప్పి సహృదయుల తదనుభూతిఁ బొందింపఁ జేయును. "నానృషిః కురుతే కావ్యం" అను సూక్తి ననుసరించి మన చౌదరిగారు నిత్యనిరాడంబరజీవితపథానుకూలురై సచ్ఛీలసదమలచరిత్రులై ఋషి పోల్కి హృద్యముగఁ దమ కావ్యముల సంతరించిరి.

మన కవిగారు ప్రతిపదము ప్రతిసమాసము రసము చిప్పిలునట్లు తీర్చి దిద్దినారు. సమాసప్రయోగము పట్ల పెద్దన్నను భాగవతకర్త పోతనను తలపింతురు.

వీరు తమ రచనలలోఁ బలుసందర్భములఁ జిన్నిచిన్ని పలుకులతో నాణెముత్తెముల సరము లల్లినట్లుఁ దోపింపఁజేసిరి. కొన్నిచోట్ల ధారాళమైన దీర్ఘసమాసములతో పెద్దన విధానమును దలంపించిరి. కొంగ్రొత్తలగు శబ్దముల పొందికలో తెనాలి రామకృష్ణుని కూర్పు కొన్నియెడలఁ గనవచ్చును. ప్రతిశబ్దములో నర్థము, అర్థములో భావము, భావములో రసము, రసమునం దానందము తెరపిలేక స్ఫురించుచుండును. సీసముల గమకమందు శ్రీనాథుని యనుకరించి చిరస్మరణీయులైరి.

వీరి గ్రంథము లన్నిట 'ఆత్మకథ' మకుటాయమాన మనక తప్పదు. వేయేల? ఉత్తమపురుషుని చరిత్ర ఉత్తమకవి ఉత్తమరీతిని ఉత్తమకావ్యముగా నిర్మించుటయే. ఇట్టి యుత్కృష్టకావ్యము నుచిత రీతిని ఏర్చి కూర్చి తీర్చి తెలుఁగుభాషాయోష కొక దివ్యకుసుమముగ కవిత్వ పటుత్వ సంపద్యుక్తముగ నర్పించి విద్వత్కవిలోకమున వన్నె

కెక్కి వాసిగాంచి ధన్యులైరి. వీరి కావ్య మాచంద్రతారార్కము తెలుగువాఙ్మయ మున్నంతవరకు తన వినూత్నప్రభలఁ జెల్వొందఁ జెన్నారఁ గల్గునని యూహించుచున్నాడను. ఇక రాష్ట్రగాన మమరగానమే. ఆంధ్రరాష్ట్రోద్యమజన్యమై అచిరకాలమందె అట్టె పేకజువ్వవలె నింగి కెగసి చిటపటారావమున చిందులు ద్రొక్కుచున్నది. అద్దముపై బడ్డ పాదరసపు చినుకువలె నల్దిశల తెలుఁగుమాగాణమునందు వ్యాపించి వ్యాప్తి నందినది. ఆంధ్రు లాబాలగోపాలమును తట్టి మేల్కొలిపి తమ పూర్వపు టౌన్నత్యముల నుగ్గడించి ప్రస్తుతపు టనుకరణ నీసడించి యుదాసీనతను గర్హించి జీవనాడులందు వేడిరక్తపు స్రవంతుల పాఱించి యదలించి భావిరాష్ట్రోదయ భోగభాగ్యములందు భాగస్వాములు కండు, లెండు, రండను ప్రబోధరవము చేయుచు కర్ణరంధ్రములందు రుంయి మనుచున్నది.

'రాష్ట్రగాన' కృతిభర్తలగు శ్రీ శ్రీ చల్లపల్లి రాజావారు స్మరణీయులు. దిగంతవిశ్రాంతకీర్తిం గనిన రాష్ట్రగానకన్యను కరగ్రహణ మొనర్చిన రాజావారు ధన్యులు. పసిడికి తావివలె తదుద్యమనాయకాగ్రణి యగు శ్రీశ్రీ రాజావారు రాష్ట్రగానరాణి పాణిగ్రహణముచే "ఆ మెలనాగ నీకు దగు నంగనకుం దగుదీవు" అని యాశీర్వదించుట కెంతేని దగినవారు. ఇఁక ముగించుచు నొక్క ముక్కఁ జెప్పఁ బూనెదను. ఇట్టి రసభోగి, యిట్టి రసదాత, యిట్టి యమోఘరచనా శిల్పి, యిట్టి యభినవతిక్కన మరెవ్వరో గాదు, మన పెరటిచెట్టే. అందుచే కాబోలు - ఇంత దనుక వారిని గుర్తించక మన భాగ్యవిశేష మున నేటికి సమ్మానించుట సంభవించినది. మన చౌదరిగారిక ముందితోధికముగ భాషాసేవఁ జేయ నీశ్వరుఁడు ఇష్టకామ్యముల నిచ్చి మనుచుగాక.

# కవిగండర గండఁడు

శ్రీ సూరపనేని కాకుళయ్య

మధుర మధుస్రవంతి కుపమానము నీకవితా ప్రవాహ ము
న్మథన మొనర్చి యాంధ్రకవిమండలిమండిత కావ్యరాజి, సం
గ్రథన మొనర్చినావు కవిగండరగండడ వింక నీ మనో
రథఫలసిద్ధి యయ్యె శివరామనృపాలుని కూర్మిపెంపునన్

నీకున్ జెల్లును జువ్వె యాంధ్రకవితా నిక్షేప నిద్రాణము
స్త్రాకోశమ్ముల ద్రవ్వి బైట నిడ సీతారామమూర్తీ నమో
వాకంబుల్ గయికొమ్ము నీ విజయ నిస్వానంబు సర్వాంధ్రభూ
మ్యాకాశంబులు మ్రోగ నెత్తితి ధ్వజం బత్యంతవీరోద్ధతిన్

ఇతఁడు కవీంద్రమండలికి నెల్ల శిరోమణి భారతీపద
ద్వితయమణీమయాంగద పవిత్రనినాదము వీనిలేఖినీ
గత మయియుండు నెప్పుడును కాంచనగర్భుడు కావ్యసృష్టి నూ
ర్జితమతి రాష్ట్రిగానకృతి జెందితి వో చలపల్లి భూపతీ!

మత్తేభక్రమయాన చంపకసుమాఘ్రానంపునాసాపుటన్
చిత్తాహ్లాదకగోత్పలాక్షి ద్విపద శ్రీమోహనాకారస
ద్వృత్తోరుస్తనభారమంథర రసావిష్కార గీతన్ యశో
దాత్తన్ సుస్వరమత్తకోకిల నరేంద్రా చూడు కావ్యాంగనన్

కవుల జేబులు తడుము నిక్కాలమందు
కలరు మీవంటి ప్రభువులు కలికమునకు
ఎన్నఁడో శ్వాసనిశ్వాస లెడసియున్న
భారతీదేవి కున్నది బ్రతుకు దెఱువు

# కండచక్కెర

శ్రీ తూములూరు శివరామయ్య

తెలుఁగు రక్తంబు ఘూర్ణిల్లి తెర్లిపొరల
రాష్ట్రగానంబు చేసితి రసము లొలుక
ఆత్మకథగా రచించితి వమ్మహాత్ము
జీవితమ్మును తెలుఁగు జేజేలు మ్రోఁగ

అభ్రగంగాపగాశుభ్రశీతలధార కుపమ నీ కవిత యొక్కొక్కచోట
ప్రావృట్పయోధరప్రబలగర్జాఘోష కుపమ నీ కవిత యొక్కొక్కచోట
వాసంతమల్లికావాసిబంభరగీతి కుపమ నీ కవిత యొక్కొక్కచోట
వాణీసతీమంజువీణారణద్గీతి కుపమ నీ కవిత యొక్కొక్కచోట

కండచక్కెర తేనె యఖండఫణితిఁ
బలుకు కోకిలగానంబు కలికిమోవి
యాద్యుపమలకు నుపమయై యలరు నీదు
రమ్యమగు కైత శ్రీ సీతరామమూర్తి!

ఆంధ్రి నీవంటి సుకవీంద్రు నలఘుతేజు
దనయుఁగాఁ గాంచ నే సుకృతం బొనర్చె?
మా తెలుంగుల పుణ్యమే మహిని వెలసి
రూపముం దాల్చె నందు నీ రూపునందు

కత్తి పట్టుటకే కాదు కమ్మకులము
కలము పట్టుటకు న్నేర్పు కలది సుమ్మ
టంచు లోకమ్మునకు నిరూపించి తౌర!
కమ్మకుల కీర్తికర! మూర్తి కవివరేణ్యా!

# జాను తెల్గు

శ్రీ దామచర్ల వీరరాఘవయ్య

తెలుఁగు పొలాన నీ కలముఁ దీర్చి మదించి రసప్లుతంబుగాఁ
జిలికిన కావ్యరాజములఁ జెప్పతరంబొకొ యాలజున్నలోఁ
బొలిపిన పంచదార పొలుపొందఁగ మీఁగడ జుంటి తేనెతోఁ
గలిపి భుజించు కైవడిని గ్రాలదె నీకవితా రసం బిలన్

కెమ్మని జానుతెల్గు నుడికారపు సంపద లీనునట్టి కా
వ్యమ్ములు పెక్కు వ్రాసితి వయారె ముదంబు జనించె నీ కవి
త్వమ్ము బలే పసం దనుచు భావుకు లెల్లరు మెచ్చునట్టి పు
ణ్యమ్ము లభించె నీకు వెలయంగదవయ్య సహస్రవర్షముల్

రాయలవంటి సమ్రాట్టు నే డున్నచో పల్లకి నొకకేలఁ బట్టుకున్న
రాణ్మహేంద్రునివంటి రాజేంద్రుఁడున్నచో బంగారు బిరుదు లొసంగకున్న
చాళుక్యనృపువంటిజనపాలుఁడున్నచోఁ అధిపుఁజేయఁడె యగ్రహారములకు
మనుమసిద్ధునివంటి మహీనాథుడున్నచోఁ బంపడే యూరేగ భద్రదంతి

కాలదౌర్భాగ్యమున వారు గానబడక
కాలవాహినిలోపల లీనమైరి
యైన నీకీర్తి దిక్కుల నాక్రమించి
తనరు గావుత మాచంద్రతారకముగ

తెలుఁగు బాసకు వన్నెను దెచ్చి తీవు
కమ్మకవిత నిజంబుగా కమ్మకవిత
గాఁగ పేరుప్రఖ్యాతులు గాంచినావు
నా నమస్కార మిదియె యనారతంబు

# పూజాప్రసూనములు

శ్రీ బొడ్డుపల్లి పురుషోత్తము

అవునయ్యా! భవదీయ దివ్యకవితా వ్యాసంగమున్ జూడ స
త్కవి నామంబున కీవ యర్హుఁడవు హృద్యంబైన పద్యాల మూ
ట వినూత్నంబగు రాష్ట్రగానమున వాడన్ వాడలన్ శౌర్యపుం
జవిఁ జూపించిన సద్గురూత్తమ నమస్కారంబు లర్పించెదన్

నీ వతి పూజ్య మాంధ్ర ధరణీమధురాంకమునన్ నటించి త
ద్భావపరంపరారుచిరభంగు లెఱింగి వచించినావు వి
ద్యావిషయంబు లచ్ఛగురుధర్మమునన్ కడుమేఁటి వాంధ్రవా
గ్దేవికి నాట్యశాలలను దీర్చిన శిల్పివి నీవు సత్కవీ!

ఎఱిఁగిరి నీ కవిత్వముల యింపును సొంపును నాంధ్రమండలీ
భరమును దాల్చి నీవు మును వ్రాసిన 'యాత్మకథా'ది కావ్యముల్
ఉరుతరభావముల్ గలిగి యొప్పుచు సాటియె లేనివై మహిన్
అరుదగు దివ్యరత్నమణిహారము లాయెను నాంధ్రమాతకున్

కవిత వ్రాయంగ నేర్చిన ఘనుడ ననెడు
గర్వమున కాదు మీ పైని గౌరవమున
వచ్చి రానట్టి పలుకులన్ వ్రాసినాడ
కొనుము గురుదేవ! నా పద్యకుసుమమాల

సంతతారోగ్య సౌభాగ్య సరణి నొసఁగి
సరససాహిత్య సౌహృదసదమలాత్మఁ
జిరము నీ కవిప్రభుని రక్షించుఁ గాత
మనుచు ప్రార్థింతు నీశ్వరు నహరహంబు

# తిక్కనతో సుద్ది

శ్రీ జమ్మలమడక శ్రీనివాసులు

ముద్దుల మూటగట్టు పదముల్ వడపోసి సువర్ణ శబ్దముల్
సద్దయు నేరి కూర్చి సుధల్ చిలికించి సుగంధ మద్ది మేల్
పద్దెముల౯ రచించి ప్రతిభావిభవమ్మున తిక్కనార్యుతో
సుద్దిగ నిల్చి సద్యశము నొందితి తుమ్మలవంశ సన్మణీ!

ఒకచోట౯ బదగుంఫనంబు లొకచో నొప్పారు లోకోక్తు లిం
కొకచోట౯ మధురోక్తు లొక్కొకట భావోదారతల్ వేరుచో
సకలామోద కళాకలాపకలనా సంపూర్ణ సాహిత్యముల్
ప్రకటస్ఫూర్తి నొనర్చి మీ కవిత శోభా పూర్ణమై వెల్గెడి౯

దానధర్మ ప్రవర్తనులని మిము దెల్ప ధర్మాత్ముడైన మీ తండ్రి సాక్షి
దేశభక్తుడవంచు తేటతెల్లము సేయ సుధలొల్కు మీయాత్మకథయె సాక్షి
పరికించి మీ పరస్పరమైత్రి చాటగా నాణెమా నాత్మార్పణంబు సాక్షి
అరసి మీయాంధ్రభాషాభిమానము దెల్ప నవ్యమా రాష్ట్రగానంబు సాక్షి

కీర్తి౯ దెల్ప మీదగు పేరు సాక్షి
హరికి భక్తుండ వనగ కావ్యంబుసాక్షి
ప్రీతిఁ దెల్పితి తుమ్మల సీతారామ
మూర్తి చౌదరీంద్ర! బహుళ కీర్తిసాంద్ర!

తెనుగు తోఁటలో మధుపమై తేనెలొలుకు
నట్టి పదముల ప్రీతిమై పట్టి తెచ్చి
పద్యముల౯ గూడునందున పదిలపఱచి
ప్రజల కద్దాని నంతయు బంచిపెట్టి
నట్టి మీ ముద్దు కైతకు సంజలింతు

# చౌదరిగారి కవిత్వం

శ్రీ వంగల శ్రీరామ అవధాని

'చెవిలోనం బడుమాత్ర నెవ్వారి వచశ్శ్రీ లాత్మలం దేక్కు మా
నవకళ్యాణసమగ్రిమంబులు కృతీంద్రశ్రేణు లెవ్వారి వ
య్యావియే పూజ్యము, లమ్మహారచనలే యాచంద్రతారార్కమున్
భువి జీవించును; తక్కగల్గు రచనల్ పోవుం ధుమాధూళికై'

అని చెప్పిన కవికుమారుడి మాట చటుక్కున జ్ఞాపకం వచ్చి చౌదరిగారి రచనల్లో ఆచంద్రతారార్కమై నిలిచి భువి జీవించే దుందా లేదా నిర్మొగమాటంగా చెబుదా మనుకున్నాను. నా సంగ తెరిగిన వారే కదా యేంచెప్పినా ఫర్వాలే దనుకున్నాను. ఈ రోజుల్లో ఉన్న దున్నట్లు చెప్పినా, 'ప్రశంసా దూషణో' యని సహృదయదృష్టిలేని పండితమ్మన్యు లనుకుంటూనే యుంటారు. ఎవ్వరే మన్నను నా కేటి చింత! నా యిచ్ఛయేగాని నా కేటి వెరపు' అనుకోక పోతే యీ రోజుల్లో బ్రతకటం కష్టం. ఇట్టి కష్టాల్లో—

చౌదరిగారికన్న, వారి కవిత్వాన్ని బాగా యెఱిగినవాణ్ణి గావటంచేత మొదటినుంచి యేదో కవితావీథుల్లో స్వేచ్ఛావిహారం చేసే అలవాటుపడడం చేతా, రసాస్వాదసదృష్టిలో పుస్తకాలను చదవడంకంటె పరిశీలించటం అభ్యాసంగా నేర్చుకున్న వాణ్ణవటంవల్లా, నే ననుకున్న దాన్ని చెబుతాను. సహృదయులు, గుణగ్రహణపారీణులు మన్నించండి.

చౌదరిగారి రాష్ట్రగానం చదివిన తర్వాతనే చౌదరిగారిని చూచాను. "దీక్షా కంకణమున్ ధరించి జనయిత్రీ దాస్యవిచ్ఛేదనా

పేక్షుల్ పొంపిరిలోవ ముజ్జగము కంపింపంగ లే లెండఱు'' హెచ్చరించే మూర్తి వీరా యనిపించి, నిలువెల్ల చూచి ఆ నిరాడంబర ఆంధ్ర మూర్తిని హృదయంలో మెచ్చుకొన్నాను. ఖద్దరు దోవతి, చొక్కా, తుండుగుడ్డతో నిరాడంబరులైన యిట్టివారే దేశభక్తు లనుకొన్నాను. రాష్ట్రసాధకులని తలచాను. చెప్పేమాటలు వేరు, చేసేపనులు వేరుగా కొందరి ప్రకృతు లుంటయి కాని, శ్రీ చౌదరిగారు చెప్పే దాచరించే వారని, తమ నిజస్వభావము, విశాలహృదయమే కవిత్వంలో ప్రకటిం చారని గోచరమయింది. అయాచితంగా వారి గ్రంథాలన్నీ నన్ను చూడవస్తే, నా తలక్రిందపెట్టుకొని నిద్రబోక వాటిని సముచితంగా సత్కరించి నామనస్ఫూర్తిగా మన్నించాను.

చౌదరిగారు రచించిన గ్రంథాలు నాలుగు. (1) ఆత్మార్ప ణము. (2) ఆత్మకథ. (3) రాష్ట్రగానము. (4) ధర్మజ్యోతి. ఆత్మా ర్పణ మనేది భారతములోని కపోతోపాఖ్యాన కథకు కొత్తపేరు ఆత్మ కథ గాంధిమహాత్ముని జీవితకథ. రాష్ట్రగానము ఆంధ్ర రాష్ట్రోద్బోధ. ధర్మజ్యోతి, తమ జనకుని ధర్మరతోదంతము.

## ఆత్మార్పణము

ఆత్మార్పణమును పేరుపెట్టుకున్న పెద్ద పండితులంతా ప్రశంసిం చారు. ఈ కథ వ్యాసుని రోజులనుంచీ సంస్కృతంలో తుక్కు తుక్కయి, తెనుగు భారత సంపుటాల్లో పేరెన్నికగాంచి, శ్రీ ప్రభా కరశాస్త్రిగారి కవిత్వంలోనూ, చౌదరిగారి కవిత్వంలోనూ, మళ్ళీ క్రొత్త తొడుగు తొడుక్కుంది. ఎన్నిసార్లు తిన్నా గారెలు విసుగే

లేదంటారుగామాసు. పాడిందే పదేపదే పాడితే, పాట సారస్యం పాడయిపోతుందని నావంటి సవ్యుని యూహ. ఇందులో పరోపకారము, చిత్తశాంతి, అతిథిపూజ, పాతివ్రత్యము, దాంపత్యానురాగము, బోయవానికి సైతము నిర్వేదము పుట్టించేటట్టు కపోతోపాఖ్యానం వ్రాశారు. సందేహంలేదు. ఎన్ని క్రొత్త ఆభరణాలో పెట్టి ప్రాత చీర కట్టినట్లు, భావాలుప్రాతవయి పోయినందువలన కవిరచించిన గ్రంథాల్లో ముందు ముందు దీన్ని తలిచేవాడు లేకపోతాడేమోనని తలుస్తాను.

## ఆత్మకథ

జనసామాన్యములో ప్రఖ్యాతి రాకపోయినా కవి రచించిన గ్రంథా లన్నిటిలో మెన్నదగింది ఆత్మకథ. చక్కని శైలిలో పడ్డది. కథ ధీరోదాత్తుడైన గాంధీమహాత్ముని చరిత. పుక్కిటి పురాణము గాదు. ప్రబంధములలో ఉత్తమ ప్రబంధమునకు సరియైన ఉదాహరణం. ఏల యందురా 'ఉదార చరిత నిబంధనా ప్రబంధ ప్రతిష్ఠా' అని రుద్రభట్టున్నూ, 'నాయకో యది వర్ణ్యేత లోకోత్తర గుణోత్తరః' అని భోజు డన్నట్లు కావ్యనాయకుడు లోకోత్తర గుణుడైన గాంధీ మహాత్ముడు. రసము చిలుకు కవిత్వము, మృదుమదురపదగుంఫనాలతో భావగుణరమ్యమై యుండి, పాకవిలాసం వ్యంగ్యచిత్రంతో ధ్వని ధన్యమై ద్రాక్షా కదళీ పాకాలను రుచి చూపించింది. పలుకు తీపి, తలపు తేట, చతుర చాటూక్తులు యీ గ్రంథంలోనే చక్కని రూపొందినయి. కవి దేశభక్తు డవటంవల్ల సత్యద్రష్టయై నిజమైన అనుభూతితో పద్యాలు వ్రాశాడు. మచ్చుకు ఒక పద్యము ప్రస్తావనలో —

'వీరుల్ త్యాగులు దేశభక్తులు జగద్విఖ్యాత కీర్తిప్రభా
శ్రీరోచిష్ణులు బుద్ధ శంకర శివాజీ గాంధి గంగాధరా
న్నారీ ముఖ్యులు పుత్రులే జననికిన్ జన్మించిర గ్గౌరవా
ధారన్ భారతమాత నెంతుఁ జరితార్థత్వంబు నర్థించుచున్.

కవిగారికి పద్యమంటే చాల యిష్టం. గద్య గ్రంథాన్ని పద్య ములో వ్రాస్తూ సమర్థిస్తారు.

"పద్యంబు సర్వకవితల, కాద్యంబై గానబద్ధమై శ్రుతిహితమై
హృద్యంబై నియతం బగ,వద్యంబై లెస్స తోచువను ధారణకున్

ఎల్లరు గద్యమే చదువనిచ్చ వహింపరు, పద్యమన్న సంధిల్లును వేడ్క పెక్కురకు'' అని అనేకమందిని పద్యాలు చదవటానికి ముచ్చట పడే వాండ్లలో చేర్చారుకాని పండితులు, నాటకాల్లో వేషాలు వేసే వాండ్లు తప్ప జనసామాన్యం గద్యాలే చదువుతారు కాదూ!

ఈ కావ్యంలో చక్కని తెలుగు కవిత్వం వ్రాయటానికి కవి ప్రయత్నం చేశాడు. దీర్ఘ సమాసాలతో పద్యాలువ్రాసి తాపామర పాలు మోగించటం లేనేలేదు. తిక్కననుడికారము, పోతన శ్రీనాథా దుల పద్యపునడకలు, ప్రవాహగతిగా కుంటువడని వీరి కవిత్వంలో కనిపిస్తయి. ఉదాహరణాల కీచిన్న వ్యాసంలో తావు లేదు. కందాలు సీసాలు,గీతాలు, వెలదులు,సౌరుమురువుంజూపి గడుసుదనముంజూపినవి. వృత్తములలో నృత్యము విరివిగా కవి సాగనీయలేదు. చేతగాక కాదు. 'రాష్ట్రగానం'లో వాటి పొగరుబోతుదనము చూపించనే చూపించి నయి. ఈ కావ్యంలో కవి తన విశాల భావాలను వెదజల్లుతాడు.

"మధురతాపూర్ణ కావ్యనిర్మాణ చణుడు, నేలవేలైననేమి చండాలుడైన, నేమి? పూజ్యుండపో అతం డెల్లరికిని" అంటాడు. నిజానికంతేగా.

ఉబలాటలు, ఉక్కిరి బిక్కిరి, నిలువున నీరవుట, కూడిమాడుట, తలకెక్కుట, మున్నగు జాతీయా లెన్నో గ్రంథరచన కలంకారాలైనవి. చౌదరిగారి రచనలో వచనాలు మాత్రం ఇంత విప్లవం బుట్టిన గద్యరచన రోజుల్లో పుట్టినా పెద్దననాడు పుట్టి నట్లేయున్నవి. బహుశా ప్రబంధ సాంప్రదాయాన్ని పాటించటానికే యీ వచనాలేమో?

## రా ష్ట్ర గా న ము

ఆబాలగోపాలం గానంజేసే రాష్ట్రగానాన్నిగూర్చి యేం చెప్పాలో నాకే తెలియకుండా ఉంది. కొన్ని గ్రంథాలు పుట్టినవేళా విశేషానో కవుల జన్మాంతర సంస్కారంవల్లనో గజ్జెకట్టుకొని గద్దెమీది కెక్కి గౌరవాన్ని పొందుతయి. కొన్ని యెంతకష్టపడి వ్రాసినా కవుల బీరువాల బూజును వదిలిపెట్టలేక బయటికేపోవు. రాష్ట్రగానం మొదటి జాతిలోది. పుట్టిన నాలుగేండ్లకే పుట్టుపూర్వోత్తరా లాంధ్రులకు ప్రబోధించి, కట్టులో, బొట్టులో, జుట్టులో మనసులో, మాటలో క్రియలో యాంధ్రత్వ ముట్టి పడాల్నని హెచ్చరించింది. జాతీయోద్యమాలతో జాతీయగీతాలు తలలెత్తి చూచినట్టె రాష్ట్రోద్యమాలతోపాటు రాష్ట్రగానం తలచూపింది. ఇట్టి జాతిగౌరవాన్ని శ్రీరాయప్రోలు సుబ్బారావుగారు, శ్రీ సత్యనారాయణగారు పురికొల్పారు. 'ఆంధ్రప్రశస్తి' ఆంధ్రజాతి పూర్వప్రథ, శతాబ్దాలయందు జచ్చిపోయిందని కనుగొలకుల నీరు గార్చింది. రాష్ట్రగానము, యీ వాతావ

రణంలోనే పుట్టి ఆంధ్రపౌరుషము, ఆంధ్రప్రతిభ, ఆంధ్రకళాజీవనము.. రసభావావేశంలో కడవపోత పోస్తూ ఆంధ్రపుత్రులకు కైవారమిచ్చి, ప్రబోధించింది. అరవలగోడు నంతరింపజేసి, తమిళాంధ్రులను పరమ మిత్రులుగ జేసి; మాతృభాషాసేవకు మన బుద్ధుల మరల్చింది. తెలుగు శిల్పవిన్యాసంలో దేశికవితల పచ్చతోరణాలగట్టి, తెలుగుతల్లిని రథోత్సవాని కాయత్తం జేసింది.

కవిత్వాని కానందం ప్రయోజనం. కవికి తన భావపథంలో స్వేచ్ఛాగానం జేసి ఆనందించటం పరమాహ్లాదం కలిగిస్తుంది. కవనం జన్మాంతర సంస్కారజన్య ప్రతిభా విశేషంలో పుట్టి లోతు లెరుగరానిదై యుంటుంది. అది పాత్రతెరిగి, సహృదయునికి, వాని విజ్ఞాన భాండపరిమాణంలోనే దానంచేస్తుంది. పాఠకుని సంస్కారంకొద్దీ కవనంలో మెరుగులు తేటతెల్లమవుతయి. కవితాహృదయాన్ని ఆస్వాదించే సహృదయుని అభిరుచిని బట్టికూడా కవితానందం భిన్నంగా ఉంటుంది. సహృదయుని విజ్ఞానమంతా కవిహృదయాన్ని గుర్తించటానికే వినియోగపడితే ఆ కృషియంతా సత్యాన్నే నిర్వచిస్తుంది. అందుకనే సహృదయుడు రాష్ట్రగానం వంటి సద్గ్రంథాల్లో ఆనంద భిక్షువుగా పర్యటనం చెయ్యాలి. ఆలోచనావీధుల్లో విహరించినకొద్దీ; ఆలోచనామృత మమృతసత్రం బెట్టుతుంది. రాష్ట్రగాన కవిత్వం జిలేబిపాకాన పడది. మైసూరుపాకం వలే కఠినంగాక, హల్వావలె దూదివలె నుండక, కరకరలాడే వేడిజిలేబివలె, తియ్యనైన పాకంలో తేలిపోయింది. కవిత్వాపోకడలన్నీ ప్రాతజగ్గు క్రొత్తనిగ్గు కలిపి క్రొత్తపూత పూసినట్లు ఉంది. రాష్ట్రాభిమానం, భాషాభిమానం, ఆంధ్రాభిమానం కవిభావాన్ని కవ్వి

స్తుంటే, కవి ఆవేశాన్ని బొంది 'బొట్టుబొట్టు కొకవేయి మొదలుగా' జాలిప్రేగుల్లో హృదయాలను కరిగిస్తాడు.

'మంటికుండయునుల్లమంచంబెఱుంగకచందవోల్‌పురముపెంపొందునాఁడు
కొల్లకొల్లగ మోటుపల్లిరేవునఁ బిసాళించు కస్తూరిని దించునాఁడు
రతనాల ముత్యాలరాసులు పోసి రాయల రాచ వీటిలో నమ్మునాఁడు
మంచుందెరల నీసడించు సెల్లాలుబందరుదుకాణంబుల మెఱయునాఁడు
అందచందమ్ములకుదీవులైన తెలుఁగు,సతులుపన్నీటికలయంపిచల్లునాఁడు
నీ విలాసంబు నిండిన ఠీవిగాంచి పొంగలేనైతి నక్కటా! పురిటిగడ్డ!'

తెలుగువార్ని హెచ్చరించటం మరువలేము.

"కలదోయి! తెల్గుఁజోదుల తుటారికటారిచెలరేఁగిపగరఁజీల్చినదినంబు
కలదోయి! తెల్గురాజులు గంగగట్టుపైఁ దీండ్రించి పడగలెత్తినదినంబు
కలదోయి! రేవురేవులఁ దెలుంగుసరంగు మొనసి లంగర్లుదింపినదినంబు
కలదోయి! తెలుఁగుపల్కులవెలందివెలందివెలుఁగులెల్లెడలఁబర్వినదినంబు
కలదు కలదోయి! తెలుఁగుప్రెగ్గడలు మన్ను
మిన్నుతాళంబు వైచి పేర్గన్న దినము
నేఁటి నీపాటు లెంచి కన్నీటి నిడకు
నిలుచునే కాల మొకలీలఁ దెలుగుబిడ్డ!"

"యావదాంధ్ర విషయమ్ము నొక్క రాజ్యమ్ముఁ జేసి,
పట్టి జయభేరిపై దెబ్బగొట్టు వఱకుఁ
దెలుఁగు పసిపాపకైన నిద్రింపఁదగునె"

యనువాని దీక్షాకంకణ మాంధ్రుల కాదర్శప్రాయమైనది.

సీతారామమూర్తిగారు అన్యభాషార్చకులను పరిహాసించారు, చూడండి.

## చౌదరిగారి కవిత్వం

"పసగల జవ్వనంబు పరభామలకున్ బలియిచ్చి మాంసమున్
వసయు నశించి రక్తము లవంబును లేక చరచ్ఛవంబులై
నసిచెడినట్టి తెల్గు లొక చందము నందము లేని పాత్రముల్
పుసపుస గీసి దుర్యశము పూసిరి కమ్మని తెల్గుబాసకున్"

ఇట్లా ఉదహరిస్తు పోతే కావ్యమంతా యెత్తి వ్రాయడమే అవుతుంది. ఈయన బెళుకైన కవిత్వాన్ని, విచిత్రమైన పదవిన్యాసంలో వ్రాస్తాడు. 'ఒక యంత్రబ్రహ్మ' 'మన దేవయ్య' 'పిచ్చుక పైబ్రహ్మాస్త్రం'వంటి తెలుగు నానుడులు ఉచితంగా పడి మరువవీలుగాకున్నయి. 'పాదుపాలకే కుచ్చుటో'పీలుపెట్టుట" కొమ్ముదిరిగిన వారలే కొలువు సేయ దిక్కులొత్తిన మొనగాడగుట; 'రసలుబ్ధులకు కళావిలసనము బాకీకిచ్చుట; మున్నగు భావా లాంధ్రుని ప్రాశస్త్యంలో నవ్యాతినవ్యాలు. వీరి చల్లారని కవితాపిపాస, భాషాసేవకుల కారాధ్యమవుతుంది.

"నాకే గాదు భవచ్చరిత్రము లనస్యప్రాప్యధారారస
శ్రీ కందమ్మన నందగించు కవితా జిత్రించు భాగ్యంబు ను
ద్రేకస్ఫూర్తియు నస్మదీయ మగు పుత్రీపుత్రక శ్రేణికిన్
వాకల్పాంత మనుగ్రహింపఁగదవమ్మా ! ఆంధ్ర వీరప్రసూ!"

### ధర్మజ్యోతి

కోకిలకు గానము మల్లె, కవికి కవిత్వం జన్మాంతరసంస్కారంవల్ల లభిస్తుంది. దీన్నే ప్రతిభ అంటారు. వ్యుత్పత్తి (విషయజ్ఞానం) నార్జించి కవి యుద్గ్రంథాలు రచిస్తే ఆ కవిత్వం సహృదయులను తలలూపిస్తుంది. కవి రసికుడైతే కావ్యం రసమయ జగత్తవుతుంది. కవిహృదయ మెప్పుడూ

మహోన్నతంగా ఉంటుంది. వారి భావపథాని కంతులేదు. ఆ భావాలు అవధులతో కూడిన బాహ్యప్రపంచాన్ని దాటి ఉత్తమోత్తమమైన ఆంతరంగికప్రవృత్తుల విమర్శచేస్తే ఉత్తమోత్తమా లవుతయి. అందు కనే Shakespeare గొప్ప కవి యన్నారు. Mathew Arnold కవిత్వము Poetry is at bottom the criticism of life' అన్నారు. ఈ ధర్మజ్యోతి జీవిత విమర్శ కావటంవల్ల, జీవితాదర్శాలతో కూడిన క్రొత్త భావా లిముడ్చకోవటంచేత, కవిత్వం బాహ్యప్రపంచకసంచారి కాక ఆత్మసౌందర్య వికాసంలో మునిగి తేలటంవల్ల, సత్యం శివం సుందర మంటూ ధర్మజ్యోతిని వెలిగించటం కారణంగా ఉత్తమమైన గ్రంథ మవుతుంది. ఈ రచన నవ్యకవిత్వం పోకడలు కలిగియున్నది. ఎందుచే ననగా 1. ఆత్మాశ్రయభావాలు ప్రకటించటం 2. సోషలిజమ్, కార్మిక, కర్షక జీవితాల విమర్శచేయటం, 3. తన జీవిత చరిత్రను పూర్వుల జీవితచరిత్రను వ్రాస్తూ Biographical element తో రచనచాటునుండి కవి తొంగిచూస్తుండటం. 4. శ్రీనాథునివలె నవ్యుల మతంలో ఉత్తము లైనవారికి కావ్యాన్నంకిత మీయవచ్చుననటం మొదలైన విషయాలు కావ్యానికి నవ్యత్వా న్నాపాదిస్తయి.

రచనల చాటుకవి కాళహస్తి మాహాత్మ్యములో ధూర్జటివలె Samson Agonistes లో Milton వలె, స్వేచ్ఛాప్రియుడై చెప్ప దలచుకుంది కపటం లేకుండా చెప్పివేస్తాడు చూడండి. అన్నీ క్రొత్త భావాలు. ఆనునికాలు.

1. ధనమును పేర్చటం

"ఒక పుట్టుకుంక తనతాతలికివచ్చిన రెండు రూకలే డెబ్బదివే
లకుం బెంచెం బెంచినదిహా,టకమా? వివరింపు ముత్కటం బగు నఘమా."

## 2. పేదల రక్తము పీల్చుట

"యుగయుగాల నుండియును ధనవంతులీ, రీతి నీతి పాపభీతి లేక
పీల్చుచున్న వారు పేదల రక్తంబు, తీయ తీయ కొండ తేనె వోలె."

ఈ భావాలు మరీ సోషలిజమ్ (Socialism)లో పుట్టి కవి హృదయాన్ని ఆకర్షించినయి.

"చెమటలోన జీకి చీకి కష్టించు బడుగు, కమికెడంత కన్నంబు లేక యేకారు టేమి?
యెండకన్నె యుంగనిశుంగ లింద్రభోగ మగున్నటై కోరమీసాలు మలపు టేమి?
ఎవని ఎముక లీ మేడల కిటుకలయ్యె, నెవని రక్తంబుచే గోడ లిట్లుబిగిసె?
నతనికాయిట్టి పరమ హేయపుబ్రతుకు, వానికాయిట్టి దుర్మరణానుభూతి."

కవులు భవిష్యత్తును పాడువారన్నాడు, Milton. అట్లే చౌదరీ గారు ధనికుల భవిష్యత్తు పాడేరు.

బొట్టు బలిసి నేడు విఱ్ఱవీగుచునున్న, సాహుకార్ల మాట సాగ దిట్లు
రుద్రమూర్తియై దరిద్రుండు చిచ్చఱ, కన్నువిప్పి గజ్జెగట్టు నెపుడొ"

రాష్ట్రగానం రాష్ట్రసాధన కాగానే సాక్షి వలె Addison & Steel Spectator వ్యాసాలవలె Battle of the books వలె, Dryden satire వలె Pope's Dunciade వలె గ్రంథాన్నాంధ్రులు మరచిపోవచ్చును. ఆత్మకథ ప్రాముఖ్యం యెప్పటికన్నా ప్రపంచ పరిణామంలో పాయ్యే కాలం వచ్చి సత్యాహింసలకే ముప్పు వాటిల్లితే తప్ప తగ్గిపోదు. ఇక ధర్మజ్యోతి నేటి యుగభావాలను జీర్ణం చేసుకొని; క్రొత్త ధర్మాలకు కుదురు దిద్దుకొని, నేటి యుగాని కనువైనదై, సత్యం శివం సుందరం అనే ధర్మాన్ని నిర్వచిస్తూ శీలాన్ని ప్రతిపాదిస్తూ సహృదయు లున్నంత కాలము కం విశాలభావాలను ప్రకటిస్తూనే యుంటుంది. సత్కావ్యములు చిరంజీవు లగుగాక. సమస్తే.

# స్వాగతము

శ్రీ తాళ్లూరి రాఘవయ్య

నీ కవితాసుధారసము నెమ్మది చిల్కిన జేవురించెదున్
నాకముఁ జేరినట్లు, పరమాద్భుత సౌఖ్యముఁ గాంచినట్లగున్
నీ కల మింతశక్తిగల నిగ్గున నొప్పగ నేమిహేతువో ?
నీ కరపాటవంబు నది నేర్పును బొందెనొ స్పర్శసన్నిధిన్ ?

కవితాకన్యక యిచ్చగించును సఖా! క్రమంపు భూషావళుల్
నవలావణ్యము వాంఛనీయము కదా నానాప్రకారంబులన్
అవమానంబు ఘటిల్లునే? కుశలమా హస్తంబునన్ దిద్దవా ?
కవితాదృష్టినిఁ దిక్కనార్యసుకవిఖ్యాతి న్విరాజిల్లితౌ

రాగ మెఱుంగలేదు మనరాష్ట్రసుగానము గాంచినార మే
లాగునఁ బాడినావొ ? తమ లావును దెల్పఁగ శక్యమానె ? నీ
రాగమహత్త్వ మేమొ ? భళిరాయని పాడదె యాంధ్రలోక మీ
స్వాగత మందు కొమ్ము; సువిచార వివేక గుణాంచదాశ్రయా !

# సత్కవీశాగ్రణీ!

శ్రీ వడ్లమూడి వేంకటరత్నము

జిలుగుం గాంతుల భాస్కరుం డుదయ దిక్సీమంతినిం గూడినన్
గలనాదంబుల పక్షికూటువలు నానాదిక్కులం జేరినన్
తెలుగుం గుఱ్ఱలు ప్రాలుమాలికను నొత్తిల్లంగ వీక్షించి నీ
వెలయిం బాడిన రాష్ట్రగానములు గావే వారి మేల్కొల్పెడిన్

కమ్మని తేనె సోన నవకమ్ముగ సుందరపుష్పమందుఁ దా
నిమ్ముగ సౌరభం బెలయ నించెడిరీతి మనోజ్ఞ భావముల్
కమ్మని శబ్దపాళి యొడికమ్మగు రీతిని జాగుచుండుటల్
సొమ్ములుగావె నీ కృతికి సూరిజను ల్దలలూచి మెచ్చగన్

తిక్కన పారితోషికము తెచ్చుకొనెంజుమి పెద్దదంచు దా
నొక్కటి ప్రోడ చిన్నది కవీంద్రుల మన్ననలంది ప్రముక్కడుల్
ప్రక్కలకుం దొలంగ చలపల్లి పురీశుని చెట్టపట్టె నె
మ్మక్కువతోడ; నీ కృతి కుమారిక యెంతటి జాణలోగదే!

అన్యాలభ్య ఫలంబు నీదు కృతికన్యారత్నముం గాంచి తా
ధన్యాత్ముం డల చల్లపల్లి వసుధాధ్యక్షుండు ధీశాలి రా
జన్యాధీశ్వరు డేర్లగడ్డ శివరామాఖ్యుండు ప్రేమించె నీ
కన్యాదానఫలంబు గల్గు టొక టెక్కా సత్కవీశాగ్రణీ!

నన్నయ నెన్నడలోఁగసున న్నడచుం గద యొక్కచోట తి
క్కన్న తెలుంగు మర్మముల తెన్నులు దిద్దుకొను న్మఱొక్కచో
చిన్నయసూక్తి శబ్దతతి చెన్నుల ప్రౌఢతనంబులెల్ల దా
నెన్నుకొనున్ భవత్కృతి య దెంతటి సుందరతాభిలాషయో!

ఇంకను నిట్టి కావ్యము లనేకము లన్నలురాణి మౌక్తికా
లంకృతమేఖలాఘులఘులంకృతకింకిణుల స్రచించుచున్
జంకని స్వస్థతాగరిమ సర్వసుఖంబుల దిద్దుకో! యశః
పంకజనేత్రతోడ వడి వంక లెఱుంగని కాపురం బిలన్

# వైతాళికుఁడు

శ్రీ చిరుమామిళ్ల విజయ పార్థసారథి

పూతచరితుఁడు భారతపుణ్యపేటి
లోకకల్యాణసంధానలోల బుద్ధి
స్వీయచరితమ్ము పద్యము చేసినావు
విశ్వశ్రేయము కావ్యమై వెలయుకతన

వాక్యము రసాత్మకమ్మయి వరలుచుంట
భావవిస్ఫూర్తి, నిర్దుష్టభాష, జిగివి,
తెనుగు నుడికారపు పసందు, తియ్యదనము
కావ్యగుణముగ వర్ధిల్లు కవివి నీవు

తెనుగు ప్రతిభకు దొల్లింటి తేజమలరు
రాష్ట్రమే తెన్గు తెలుఁగును రాల్చునంచు
పంచమస్థాయిలోనను పాడినావు
తల్లి దాస్యము బాపు వైతాళికుడవు

పూర్ణిమను వెన్నెలలు ఆరపోసినట్లు
మల్లెమొలలు జాజులు చల్లినట్లు
కమ్మకస్తూరి వాసనల్ క్రమ్మినట్లు
కిన్నెరల పాట నీ రాష్ట్రగీతి ఫణితి

హాలము యోధుడవై పుట్టి కలము పట్టి
తుచ్ఛముగ చేయి చాపని అచ్ఛశీలి!
కాసునకును లోబడక నిష్కామముగను
అంకితము చేసినావు కావ్యములు నీవు

# సుహృన్మణీ!

శ్రీ మిన్నికంటి గురునాథశర్మ

అలఁతియలఁతి కోమల పద
ములు, నిండితొణంకి దరులఁ బొర్లెడి రస ము
వ్వేల లూఁగు శయ్య, క్రొంద
మ్ముల తావుల రేఁచు భావములు, నీ కవితన్

అరరే ఆంధ్రదిగంతరాళములఁ గీర్త్యర్థంబు గొడ్డేటి తా
తరణీంద్వృక్షముగా మనంగఁ గృతిసంతానంబు నిర్మించి తా
దరణీయంబగు సత్కవిత్వకళ ముక్తాయింపులం జూపి తెం
దఱు నీతో సరి? తుమ్మలాన్వయజ! సీతారామ విద్వన్మణీ!

అప్పన పలుకులకే మవి
త్రుప్పుపడియెఁ గాకవుల కెద్దో యన్వయమా;
ఇప్పటి నీకవన మిన్మా
సొప్పని రసికుండు వినుచు నూపండె తలన్

# తిక్కన రీతి

శ్రీ అద్దేపల్లి నాగగోపాల రావు

తిక్కన కైతసొంపును నుతించెడి నీకుఁ దదీయరీతియే
చిక్కెను లెమ్ము నీ కవిత చిక్కనిచక్కని తేనెవాకయై
పెక్కురకున్ ముదం బిడె కవీ! మధురాత్మకథానువాదమం
దెక్కడలేని సుందరతలే విరియించితి వద్భుతమ్ముగన్!

పల్లకి కేలనెత్తె నొకపార్థివు డాంధ్రకవీంద్రు మెచ్చి భూ
వల్లభు డింకొకండు కవివల్లభునిం గనకాభిషేకపుం
జల్లునఁ దేల్చె నీ కిపుడు సత్కృతి సేసెద రప్పికట్లయం
దెల్లరు నీ యశస్తరుణి యేచి నటించు సమస్తసీమలన్

తెలుగుందల్లికి నీదు సేవ కడుఁబ్రీతింగూర్చు నేహార్ద్రమై
పులకల్ వుట్టగ రాష్ట్రగానరచనమ్మున్ జూచి నిన్మెచ్చుకో
వలయుం జుమ్మెటువంటి వాడయిన వహ్వా యంచు నిన్ బోలు ని
శ్చలదీక్షారతు లాంధ్రిభక్తు లతిపూజాపాత్రు లేనాటికిన్!

అల చలపల్లివల్లభుడు అల్లుఁడుగా మదికింపు పెంపగా
పలువురు పండితుల్ కవులు బంధుగులున్ నిను పైడిగద్దెపై
నిలిపి భవత్కవిత్వగుణనిర్వచన మ్మొనరించి కొల్వ నీ
కలవడు నట్టి సంతస మనంత మనన్యము సత్కవీశ్వరా!

# అభినవతిక్కన!

శ్రీ మోటూరి వేంకటరావు

ఓ యభినవ తిక్కన! నీ
తీయని పద్దెముల తీరుఁ దిలకించినచో
రేయిని దిగు నక్షత్రపుఁ
జాయలలో హాయి యెదియొ స్మరణకు వచ్చున్

కలదోయి నీ రాష్ట్రగానప్రబోధాన మా తెన్గువారి ప్రాభాతభేరి!
కలదోయి నీ ధర్మకవితాకరజ్యోతి! కార్తిక జ్యోత్స్నా సుగంధసుమము!
కలదోయి నీ గళోచ్ఛలిత గీతముల నాత్మార్పణ విశ్వకళ్యాణభూతి!
కలదోయి నీ నుడికారానఁ దెనుఁగుముత్తెపుఁబంట తరితీపి తేట హొయలు

కలదు! కలదోయి! నీలోన గజ్జెఁగట్టి
అహరహమ్ము నర్తించు స్వచ్ఛాంధ్ర తేజ
మభ్రగంగను బోలి నేఁ డాంధ్రజాతి
పూలదోసిళ్ళతో నిన్నుఁ బూజసేయ

# సుహృత్కవి

శ్రీపెనమకూరు వేంకట సుబ్బారాయశర్మ

జలదాళీపరితఃపరీవృత మహాజాంబూనదాహార్యక
స్థలసందానితమౌ మహ మ్మలఘు సీతారాఘవీయమ్ము స
త్కలనాత్మార్పణముం బొనర్చు సుహృదుల్ గవ్యగ్రిణిం బ్రోచు దు
మ్మల కమ్రాన్వయవార్ధిజాతశుచిమన్మాణిక్యమూర్ధన్యముల్

ధర్మతైల సముత్క దీప్తమగు జ్యోతి
యాత్మకథగాఁ బ్రశంసల నందు కోలము
నందు జన్మించినట్టి నీయాత్మ కథ ప్ర
శస్తిఁగాంచుట యొక విశేషంబె చెప్పుమ

రాష మను మాటయే మనరాష జనులు
మఱచి సుఖనిద్రఁ జెందుట యరసి మీఁదు
రాష్ట్రగానంబు దూర్వాంకురంబు వోలె
గిలిగిలింతలు వెట్టి మేల్కొలిపె జనుల

# మా చౌదరిగారు

శ్రీ వెలగపూడి దానయ్యచౌదరి

చిరమిత్రుఁడు కవిముఖ్యుఁడు
సరసగుణాఢ్యుండు మాదు చౌదరి నేఁడీ
పురమున సత్కృతినందుట
నరసి ముదంపడుచు నతని నభినుతిసేతున్.

భాషలోఁగల్గు మధురశబ్దము లెఱుంగఁ
గవికె తగునన్న సూక్తి నిక్కంబుసేయ
మధురపదజాలమున్ గుప్పి బుధులు మెచ్చఁ
గావ్యముల్గూర్చు జాణవుగద కవీంద్ర

“సరసులెల్ల మెచ్చ మెఱయింతుఁ గవితలోఁ
గమ్మఁదనము మత్కులమ్మునవలె”
నని వచించి నెగ్గితౌర! కమ్మకవీంద్ర!
కమ్మఁదనము నీదుసొమ్ము సుమ్మ

పలుకుతల్లి మీఁదఁ గల మన్ననంజేసి
తెలుఁగు మఱుఁగులెల్లఁ దెలిసివాఁడి
విబుధపాళి మెచ్చ వెలయించి తాత్మక
థానువాద, మది సుధాస్రవంతి.

కవిరాజుల కవియజ్వల
కవితామార్గములఁ బట్టి గమియించి బుధ
ప్రవరాళి మెచ్చఁగా 'సభి
నవతిక్కన' బిరుద మందినాఁడవు బళిరా!

ప్రతిపద మొక్కరత్నమయి పద్యము పద్య మొకొక్క హారమై
యతికమనీయమై రుచులకాకరమై చెలువంబుఁగూర్చు నీ
యతులిత కావ్యశిల్ప మహహా! స్తవనీయముగాదె యెందు నీ
చతురత నెట్లుపొందితివి? సత్కవిచంద్రుఁడవయ్య! చౌదరీ!

కమ్మని జానుతెల్గు నొడికార మెఱింగిన వాఁడవౌట స
వ్యమ్మగు కావ్యకల్పనలఁ బ్రాజ్ఞుఁడవౌటఁ దలంచి నేఁడు నిర
రమ్మని పిల్వఁబంచి రుచిరమ్మగు సత్కృతి సేయుచున్న స
త్యమ్ముగ నీకు నీవ సరి యంచు దలంపఁగ వచ్చు సత్కవీ!

కమనీయ కావ్యభూషల
నమరిచి భారతికి భక్తి నర్పించుచు మో
దమునను నితోధికంబగు
విమలయశంబు న్గడింపు విఖ్యాత కవీ!

# కవిమండనుఁడు

శ్రీ పొన్నలూరి సూర్యనారాయణశర్మ

చారు కవితా సుధారస
ధారాపరిషిక్త బుధహృదయుఁడౌ శ్రీ సీ
తారామమూర్తిచౌదరి
సారజ్ఞులవలనఁ గొనియె సన్మానంబుల్

వృద్ధోపసేవన బుద్ధియై సంస్కృతాంధ్రముల నెంతే సమర్థతను గాంచెఁ
గవన సముత్సాహగాధ మనీష ఛందోవ్యాకరణముల నూఁత్రతావె
వేదవేదాంత సంవేద్యుఁడై విశ్వభర్తృ పదాంబుజ భ్రమరత వహించెఁ
దత్ప్రసాద సమార్జిత స్ఫురచ్చిత్తుఁడై యుత్తమవాణి నాయత్తపఱచె

సరసకవనభూషణము లోజఃప్రసాద
మధురిమలు శయ్య మున్నగు మహితగతులు
కైవసం బయియుండ నిక్కైకసరుండు
గండుకవికేసరులలోనఁ గాంచెఁ గీర్తి

మలచినయట్లు ప్రాణము లమందత నూఁదినయట్లు చేతనా
చలనము నందినట్లు వికసన్నవకైరవ దృగ్విలాసముల్
పొలపినయట్లు సత్సరసమోహనభాషల నాడినట్లు సి
స్తులపుటొయ్యారపున్నడలఁ దోఁచినయట్లు జగంబు సర్వమున్
వలపువలంబడన్ విసరినైచిన యట్లమృతంబు సల్లిన
ట్లలరులఁ గ్రుమ్మరించి నగునట్లు విలాస విశేష లాస్యముల్
మొలపునఁ జూపినట్లు పసమీఱి గభీర విభీత శాతముల్
గలుపుచు డాసినట్లువిదకైవడి ముగ్ధవిధానఁ దోఁచి తు
మ్మలకుల సీతరామకవిమండను సత్కృతితామతల్లి యి
మ్ముల రసికాగ్రణీహృదయముల్ హరియించు సమంచితస్థితిన్

ఋషులె కవులన్న వాక్యంబు ఋతమయేని
రసమయము కావ్య మనుమాట రమ్యమేని
తుమ్మలాన్వయ పాథోధి తుహినకరుఁడు
కవి యితోఽధికసత్కీర్తిఁ గాంచుఁగాత

## అభినవ తిక్కన

శ్రీ పింజల సుబ్రహ్మణ్యకవి

ఉన్నతకవిసుధీ సన్నుతంబై సర్వగతుల రాణించు విజ్ఞాన మొకట
స్వీయజాతికి సంప్రదాయసిద్ధంబైన దివ్యశక్తి ఘటించు తేజమొకట
అన్యభాషావిమోహాగ్రస్తులకు బుద్ధిఁగఱపు తెన్గుఁదనంపుగరిమయొకట
ప్రభుజనార్చితమగుచు నుభయభాషాప్రవీణత్వంబుఁ జాటుకవిత్వమొకట

వరలి యభినవ తిక్కనాహ్వాయ మొసంగి
సరస కవిశేఖరత్వ ప్రశస్తిఁ గూర్చి
పూని వేవేగ నినుఁబెద్దవానిఁ జేసె
తుమ్మల కవీంద్ర ! నిరతసంతోషసాంద్ర !

కమ్మఁదనంపు సొంపు, నవకమ్ముపసందు వినూత్నభావపుం
జమ్ములమేల్మి కల్మి నిజజాతిపటుత్వము దేశిశైలి చం
దమ్ములయందముల్ దగ ముదమ్మునఁ బాడిన నీదురాష్ట్రగా
నమ్ము నిరంతమ్మును జనమ్ము మనమ్ముల హాయిఁ జిమ్మెడున్

విలసిత సాహితీరస వివేకము తోడును నీడగాఁగ స
ల్లలిత కవిత్వ చాతురి యలంకృతియై చెలువార సన్నుతా
కలనయు తెంపులేని సిరిగా మను నిన్మది నెంచి సత్యశో
లలన వరించె నంచితవిలాసములం బచరించె ధీమణీ !

# మా బావ

శ్రీ కుట్టా వెంకట సుబ్బారావు

బావా! నీ జయభేరికా మధుర శబ్దస్తోమ మాలింపఁగా
భావం బుంచిన మాకు నేఁటికిఁ గదా పర్వంబు; సర్వాంధ్ర ధా
త్రీవిభ్రాజదశేష పండితకవిశ్రేణీ పరిస్తుత్యముల్
ఠీవింజూపెను నేఁడు నీ కవనధాటీమంజుగానార్భటుల్

రచియించితివి దయారసము చిప్పిలునట్టు లమృతభాండంబునాత్త్వార్పణంబు
కల్పించితివి కవిగ్రామణుల్ వెఱఁగంద నాంధ్ర భారతకల్ప మాత్మకథను
పాడితి వాంధ్ర భూప్రజలెల్ల జయపెట్ట రమణీయతాసీమ రాష్ట్రగాన
మభివర్ణనముచేసి తభినవతిక్కనాకృతిని ధర్మజ్యోతి కృతివతంస
మెల్ల పత్రికలకుఁ గీర్తినిచ్చునట్లు
దివ్యముగ వ్రాసితివి ఖండకావ్యశతము
ధన్యుఁడవు నీవు సుకవి మూర్ధన్యపదవి
భాసురుఁడ వీవు భాషాతపస్వివీవు

నన్నయ్యకవితలో నాజూకునకు మెచ్చి చాళుక్యపతి పూజ సలుపునాఁడు
తిక్కన్న కవనంపుఁ దీరుతీయము చూచి మనుమభూపతి మేను మఱచునాఁడు
శ్రీనాథ కవిరాజు వాణికచ్చెరు వంది రెడ్డిరాజులు మోకరిల్లు నాఁడు
పెద్దనార్యునిముద్దుముద్దు పల్కుల కుబ్బి రాయలు పల్లకీ మోయునాఁడు
పుట్టి కనకాభిషేకాది భూరిగౌర
వంబు లందంగ వలసిన వాఁడ వీవు
మా పురాసుకృతం బసామాన్య మగుట
నబ్బితివి నేఁడు మూర్తికవ్యగ్రగణ్య !

## తీరుతియ్యములు

శ్రీ పెన్మెచ్చ సత్యనారాయణరాజు

తిక్కన భారతానఁ గల తేఁటతెలుంగున తీరుతియ్యముల్
నెక్కొనఁజేసి స్వీయమగు నేర్పును గూర్పులఁజూపి కావ్యముల్
చక్కఁగ ముద్దుముద్దయిన జానుతెలుంగున సంతరింప వే
ఱొక్కఁడులేఁడు తుమ్మల కులోదధిచంద్రుఁడు దక్క నుర్వరన్

అతిరుచ్యమగు భాష నాత్మకథన్ వ్రాసి అప్పకవికి నోటఁ బప్పువెట్టె
అలకపోతచరిత్ర సలలితంబుగ వ్రాసి తిక్కనయజ్వకే కొక్కువెట్టె
ప్రౌఢభావంబుల రాష్ట్రగానము వ్రాసి అరవలగుండెపై నడుగువెట్టె
పొందుగను భజగోవింద మాంధ్రముచేసి శంకరాచార్యునే వంకపెట్టె

అనఁగ సకలాంధ్రదేశంబు నందుఁ బేరు
పొందునట్టి సీతారామమూర్తి చౌద
రికి జోహారులొనర్చుచే ప్రకృతమేను
చేయు సత్కృతిగ మనవి చేయువాఁడ

## సవ్యరీతి

శ్రీ బొల్లాపల్లి వేంకటసుబ్బారావు.

'రాష్ట్రగానమునుండి' యర్ఘ వారితతోడఁ
బరిచరితంబైన భవదీయ పద్యవితతి
నచ్చటచ్చట గొన్నింటి నరసినాడ
మచ్చుతునకల మదిఁలోన మెచ్చినాడ

అనఘా! తావక 'రాష్ట్రగానము' వదాన్యశ్రేష్ఠుడౌ చల్లప
ల్లి నరేంద్రోత్తము నంకపీఠి విలసిల్లెన్ నేడు పుణ్యాంబహో!
మును తా సల్పిన నోము పండెనుగదా! పూర్ణంబుగా; లేనిచో
ననురూపుండగు భర్త లభ్యపడు భాగ్యంబన్న సామాన్యమే

సరసుడు చల్లపల్లి ప్రభుచంద్రుని చెంగట రాష్ట్రగాన కా
వ్యరస తరంగపంక్తులు సభంబును ముట్టి బుధుల్ తదీయ పా
నరతిని నన్నముల్ మఱచినారలు నేత్రయుగంబు మూయ రి
త్తటి రసలుబ్ధచిత్తులకు ధారుణి నాకలి నిద్రలుండునే!

చల్లపల్లినాథు డల్లుండై యుండగ
నవ్యరీతిఁ గలము నడచుచుండ
నఖిల కవులలో నిరోధికంబుగఁ గీర్తి
గాంచుచుండుమయ్యా! కవివరేణ్యా!

## కవిచంద్రా!

శ్రీ భీమిరెడ్డి వేంకటప్పారెడ్డి

భావగాంభీర్యసంభావ్యంబు మృదుపద మాధుర్య సంపద మంజులంబు
గౌరవార్థవిశేష కలితంబు లలితంబు సరసనిర్మలవాక్యసంవృతంబు
సదమలాలంకార సందీప్త మనవద్య భావుకాభిప్రాయ భాసురంబు
ప్రాజ్ఞజనానీక పరమాదరము మనోహర కల్పనావిచిత్రాభిరామ
మంచితానంద విభవసమంచితంబు
శ్రావ్యనవ్య పథానుసరణము సుకవి
రాజ సన్మానితము నీదు రాష్ట్రగాన
మును నుతింతు సీతారామమూర్తిసుకవి!

శ్రావ్యంబై తగు రాష్ట్రగానపుఁజవిన్ సాధించు మర్త్యుండు శి
ష్టవ్యాపారము మేరమీర గలడా? సత్కీర్తి నార్జించు క
ర్తవ్యంబున్ విడనాడఁగాఁ గలఁడె నిత్యంబున్ దయాధీనుడై
భావ్యంబై తగు దేశభక్తిపరుడై వర్తింపడా విద్వరా!

కవిచంద్రా! భవదీయ వాగమృతసేకం బజ్ఞహృత్తాప మా
ర్చి వివేకస్ఫుట బీజముల్ నిలిపి వర్ధిల్లంగ జేసెన్ బుధ
స్తవనీయంబు భవత్కవిత్వము జగత్కల్యాణ సంధాన మీ
కవిసన్మానము నందఁ బాత్రుడవు నిక్కం బీవె చొక్కంబుగన్

## కవివతంసమ!

శ్రీ చంద్రమౌళి చిదంబరరావు

పలుకుల తేనె తుంపరలు పానకముల్ వెదజల్లు భావపుం
దళుకుల నిగ్గుజూపి లలితంపు విలాసము చిందుశైలి ను
జ్జ్వలరసపూరధార రుచిపాక చమత్కృతిఁజూపు రీతిచేఁ
జెలువము నింపు నీకవితచే మురిపించితివౌ రసజ్ఞులన్

పాటలీపుత్రంపు కోటపై నెగిరిన ఆంధ్రుల బావుటా యందమునకు
రాచూరు పురిదరి రణమున మెఱసిన తెలుగురావుతు కత్తిదళుకులకును
విద్యానగర రాజవీథుల నిండిన రతనాల ముత్యాల రాసులకును
వింధ్యాద్రిశిఖరనివేశితాంధ్రపిశాలకీర్తి కన్నియ కనుగీటులకును
పలచి తలయూచి చూచి నీ కల మఖండ
రయము జవమును దోప నిర్భయముతోడ
పరువు లిడె ప్రేమభరము నాపంగ లేక
కీర్తిమహిత సీతారామమూర్తి సుకవి!

దేశపూర్వోన్నతి దీపించు వర్ణనల్ చదివిన హృది ముద మొదవుపట్ల
పతితపూర్వోన్నత స్థితిగతిఁ దలపింప జదివిన నెద ఖేద మొదవుపట్ల
తెలుగుజోదుల కత్తి తళతళల్ జూపింపఁ జూచి యుత్సాహంబు దోచుపట్ల
పూర్వాంధ్రవైభవ సర్వస్వరూప మీక్షింప దేహము పుల్కరించుపట్ల

వీరకరుణాద్భుత రసాలు వెలుగుపట్ల
తన్మయావస్థఁ జెందె చేతమ్ము నాకె,
యరుదవయేడు దాటినయట్టి వేళ
కవివతంసమ నీ రాష్ట్రగాన మహిమ

## కవితారాష్ట్రపతే!

శ్రీ అమ్మిశెట్టి లక్ష్మయ్య

కవితారాష్ట్రపతే! నమోస్తు భవతే; గాఢాంధకారమ్ములో
దిబ్బులుంబడ్డ తెనుంగు రాష్ట్రమునకున్ దీపాంకురంబైన నీ
కవితాకన్యకుఁ జావులేదుర! యనర్ఘమ్మైన రత్నమ్ముగా
శివరామప్రభు దిద్దినాఁడవుగ; తత్సీమంత సీమంబులో

నిను మన తెన్గుసాహితికి సిల్పిన మేలిపతాకగాఁ గనుం
గొనినది నేటికాంధ్రజన కోవిదలోకము; సుంతమేలె, ఈ
తెనుఁగుఁ నెందఱీదృశు లతీంద్రియ దివ్యదఖండ సత్కళా
ఖను లుదయించి జాతి కులకక్షు నణంగిరో? సత్కృతిప్రసూ!

ప్రీలఁగఁబండు ఈ తెలుఁగుబిడ్డల మేలిమి జీవగడ్డపై
వ్రాలిన యర్వపిట్టల పరంపరకున్ వడిసేలఁ బద్యపుం
జాలిడి క్షేత్రమంచియ నిలంబడి సేయుచు రాష్ట్రగానమున్
ద్రోలితి వ్రేటుకొక్క [illegible] తూల బలే! కవిరాట్కృషీవలా!

ఎంతగడొక్కఁ జిచ్చుడుకులెత్తెనో? నీకును రాష్ట్రగాన మొ
క్కింత పఠింప విన్న సివమెత్తును నాకును; అర్వాగుజ్జ్వముల్
గంతులుమాన నోళులకుఁ గక్కుల కళ్లెములన్ దగిల్చి రే
వంతులఁజేసి నీ తెలుఁగువారి సవారిడఁ జేసినావురా!

నీలోరేఁగిన భావవిప్లవ మహాగ్నిజ్వాల సైరించుకో
నాలోచించి మహాత్మునాత్మకథ వ్రాయంబూనినావేమొ! ఈ
ప్రాలేయాచల తుంగ శృంగతల నిర్యద్గాంగపాథస్తరం
గాలింగత్కవితోరుధార లిటులేలా! నీకుఁ జేపట్టఁగన్

## అ భి న ం ద న ము

శ్రీ కొప్పరపు బుచ్చిరామకవి
(కొప్పరపు కవులు)

శ్రీమంతంబగు తెల్లదీవిమణిభాక్సింహాసనంబందు దీ
క్షా ముద్రన్ వహియించి విశ్వంభరగానాసక్తిన్ వెలుంగొందు దు
ర్గామాహేశ్వరి కావ్యకృద్గరిమ సర్వజ్ఞత్వముం గాంచ ధీ
ధాముల్ బ్రోచుతఁ దుమ్మలాన్వయుని సీతారామమూర్తిన్ గృతిన్

కృతినాథత్వము రాష్ట్రగానకృతిసత్కీర్త్యాకరానంద సా
త్వతివృత్తిం గయికో లోనర్ప సుకవీడ్వాంద్యప్రదాతృ ప్రథా
యతిమై చల్లపల్లి ప్రభుండు చిరభాగ్యాయుష్య సంపత్తి న
చ్యుతుఁడై రాష్ట్రరమన్ వహించుఁ గృతిభాగ్యోగంబు దీపింపఁగన్

రసకవితా ధురంధర సరాగము నీ మృదువాణి గీతికా
ప్రసవమరంద మాన నృపరాజియు కాదు కవీంద్రపాళియున్
రసికత నిల్ప నిత్య మనురాగమునం దమిఁ గోగు నన్నచో
రసికులఁ దెల్పనేల భళిరా కృతకృత్య భవుండ పన్నిటన్

అనసూయా మహిమంబు తేటపడు నిన్నాత్మీయుగా నెంచి మె
చ్చినచో మెచ్చిన స్వీయగౌరవము నిర్జీవాభమౌనంచు మూ
ర్ఖులను మూర్ఖుండది లెక్కసేయకుము నిన్గొండాడువారెంద తే
జనతావంద్యులు కల్గి రెల్లెడఁ గవీశా! కమ్మవంశోద్వహా

## సమ్మానము

**శ్రీవారణాసి వేంకటేశ్వరులు**

కవితా దర్శక భావరూప విలసత్కాంగ్రెస్సభా ధారుఁడు
జ్వల సత్యాగ్రహ శాంతి సంగర చమూ సంధాతృ చారిత్ర ని
స్తుల గంభీర వినూత్నభావ కవితాశోభా మనోజ్ఞంబుగన్
బలుకంగల్గి యశంబు నిల్పితివి సుమ్మా! కమ్మ వంశోత్తమా!

ఖురుచైపోయిన యాంధ్ర తేజము తెలంగాణంబు నందంతటన్
మరలన్ నింపఁగ రాష్ట్రగానమును నిర్మాణంబుఁ గావించి యె
వ్వరికిన్ లభ్యముఁ గాని గౌరవపద ప్రఖ్యాతులం గొంటి; వా
దరణం బాంధ్రమునందు నీకె తగు సీతారామ మూర్త్యగ్రణీ!

కవిలోక శిఖామణి! మీ
ప్రవిమల మృదు మధుర గ్రంథరాజము లెల్లన్
జెవులకుఁ జవులిడు తెనుఁగుం
గవితా లలితాంగి కంఠ ఘనహారములో!

చల్లని యుల్లమునన్ విల
సిల్లెడు చలపల్లి రాజశేఖరు నండన్
బెలుగ భాసిలుత మీ
సల్లలిత కృతీమతల్లి శాశ్వతమగుచున్

తెలుఁగుందేశము నందు మీకుఁగల జాతీయాభిమానంబు, గూ
పాలయర్ నిర్మితిసేయు మీకవన మాంధ్రోర్విన్ బ్రకాశించుతన్
చెలఁగుంగావుత మీకు నెల్లపుడు సుశ్రీ లాయురారోగ్యముల్!
మలయుంగావుత అప్పికట్ల పురి సమ్మానంబు సుస్థాయిగన్

## కవితాసత్కృతి

శ్రీ మండవ బుల్లిరామయ్య చౌదరి

ఆత్మార్పణమున నార్యత్యాగమహిమంబుఁ బ్రచురించితివి నన్నపార్యఫణితి
నాత్మకథాళి మహాత్మ సేవాసక్తిఁ బ్రకటించితివి కవిబ్రహ్మ శక్తి
రాష్ట్రగానమునన్ స్వరాష్ట్రాభిమానంబుఁ బ్రవచించితివి సార్వభౌమసరణి
పితృపాదు పూత జీవిత గాథ నొడివితి సోమనాథుల వచోద్దామలీల

నెన్న నేల; నన్నయఁదొట్టి చిన్నయార్యు
వఱకుఁగల కైతలందు మేల్తరము లోలయఁ
జాటువులఁ గూర్చి యాంధ్రభాషకు వినూత్న
రవణలొసఁగిన సత్కవి ప్రవరుడీవ

వంశపుంబేరఁ గల ముండ్రు భ్రంశమంద
హాలముఖ విభూతి మీతండ్రి యలరినట్లు
కులములోఁ గమ్మఁదనము నీ కలములోనఁ
జిలుకరించితి గావ్య సుక్షేత్రములను

మీ రసవద్వచోగరిమ మీమృదుసాధుపద ప్రయోగముల్
మీరుచిర ప్రకల్పనలు మీఱిన కూరుపునేర్పు మీ మహో
దారగుణం బెఱింగి వసుధాజను లిప్పటికైననీకుఁ గ
ర్పూరపుఁదమ్ములంబిడుట పూజ్యగుణగ్రహణంబు కాదొకో!

వినుత నిర్దుష్టరసవత్కవిత్వ కలన
వీర రసికాంధ్రలోక మనోరథాళి
నెక్కియున్న మీ రెపు డేన్గు నెక్కుటేమి
గొప్పయగు నప్పికట్లకే గొప్పగాక!

## అభినవతిక్కన

శ్రీ కన్నెకంటి వీరభద్రాచార్యులు

సరళంబై నటువంటి ధారమది కుత్సాహమ్ముఁ జేకూర్చు నా
క్షరసీజమ్ములకాంతి, పైనుభయభాషాసాహితీశక్తి, సు
స్థిరమై నీకవితా ప్రపంచమున నే దీపించు వర్ణించ నా
తరమా! తుమ్మలవంశవారినిధిచంద్రా! ఓ కవిగ్రామణీ!

తిక్కనకైతలోఁ గలుఁగు, తియ్యన, త్వత్కవితారసమ్ములోఁ
జక్కగనిల్చె; దానిఁ గవిసంఘు మెఱుంగదె; చెప్పనేల, నీ
శక్తి, భవత్పురాకృత తపః పరిపాకముచేత లభ్యమై
దక్కెను, నిశ్చయంబిది కదా కవితావనితాయుతా! హితా!

అన్నా! నీకవితా సుధారసము నాహ్లాదమ్ముతోఁ గ్రోలి, యె
న్నెన్నో మారులు తృప్తిఁ జెందితిని, కానీ, యూటలే యూరు నీ
సన్నాహంబును. విన్నదాది, మది కుత్సాహమ్ముఁ జేకూరె నీ
యౌన్నత్యంబును గోరియుండుటఁ గవీంద్రా! బుద్ధి వాచస్పతీ!

మదికింపున్ సమకూర్చు త్వద్రిచిత ధర్మజ్యోతిలో నిల్చియు
న్నది నీ తండ్రి పవిత్ర జీవితమ, అన్నా! హేమమున్ మట్టిగా
హృదయంబందు దలంచి సత్యపథమూహించెన్ గదా; యట్టి యా
సదయస్వాంతుని కుద్భవించితివి, నీ జన్మంబు సామాన్యమే

నీ రాష్ట్రగానంబు నిర్మలాంధ్రక్షమా రమణికి కంఠహారమ్ముగాగ
నీ యాత్మకథ జగద్ధ్యేయమై శ్రేయమై భారతాంబా యశఃప్రభలనిలుప
నీ పద్యభావముల్ నిశ్చలజ్యోతులై దురితాంధకారముల్ దొలగఁద్రోయ
నీ సత్యమయజన్మ నిజయశశ్చంద్రికల్ దిగ్దంతి దంతాల ధిక్కరించ
దేశమాతృఋణముల్ దీర్చి దివ్యసభల
రాజసన్మానముల గాంచి తేజరిల్లు
నీ మహాశక్తి నేను వర్ణించగలనె
అభినవోభయ కవిమిత్ర శుభచరిత్ర!

శివరామ ప్రభు ! నీదుహస్తమున నిల్చెన్, రాష్ట్రగానాబ్జ మా
దివిషత్సంఘము మెచ్చ, నాంధ్రజనయిత్రీ పాదపూజార్థమై
కవిహంసంబిడ నేఁడు, త్వద్విజయశంఖ ధ్వానముల్ మ్రోగనో
యవనీనాయక ! యేరగడ్డకుల సోమా ! చలపలీశ్వరా !

## నూతనకవినాథుడు

శ్రీ తాళ్లూరి జియ్యరుదాసు

నిక్కము దాపనేల సుకవిస్తుత ! మీకవితావధూటికిన్
జిక్కె జగత్ప్రసిద్ధగుణ శీలుఁడు మాన్యుడు "చల్లపల్లి" పెం
పెక్కిన తీరులన్ రుచుల నీనెడి భావములన్ గదించి మీ
చక్కని కన్యకామణిని సాకును భారతి యెల్లవేళలన్

కవులకు పుట్టినిల్లనెడిఖ్యాతి గడించిన యప్పికట్లలో
భువనపతీంద్రుడు చల్లపలిభూవు సమక్షమునందు నీదు స
త్కవన కుమారికా మధుర'గానము' వీనులగ్రోలు భాగ్యమే
కవిజనకుండు బొందు రసికాగ్రణు లుండిన నిండుకొల్వులోన్

శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు తొందర పనులుంటచే మీ యాహ్వానము ననుసరింపఁజాల మికి మిక్కిలి విచారము తెల్పుచున్నారు. శ్రీ సీతారామమూర్తిగారి కవితా ప్రౌఢిని గూర్చి వారికి మహోన్నతమైన సదభిప్రాయము కలదు. ఉత్సవము జయప్రదముగా జరుగునట్లు వారు ఆసించుచున్నారు.

బెంగుళూరు
26—6—42

యస్. కె. రెడ్డి
కార్యదర్శి

# భాషా సేవ

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ

భారతి మొదలైన పత్రికల వలన శ్రీ సీతారామమూర్తి చౌదరిగారి కవితామృతమును గ్రోలు భాగ్యము నాకు గల్గినది. కపోతదంపతులు బోయవాని కొనర్చిన ఆతిథ్యగాథను వారెంతయో హృదయాకర్షకముగ విరచించిరి. కవిప్రతిభ కవనమల్లుటలో లేదు. కవితావస్తువు నెన్నుకొనుటలో నున్నది. చౌదరిగారు మహాత్ముని ఆత్మకథను పద్యకావ్యముగ విరచించుటలో; వారి అకుంఠిత దేశాభిమానమునే గాక అపూర్వప్రతిభను గూడ జూపిరి. దేశకాలముల గుర్తింపని కవియొక్క కవిత మనోరంజకమైనను జనరంజకము గాజాలదు. దేశకాలముల గుర్తించి శ్రీచౌదరిగారు రాష్ట్రగానమును రచించిరి. ఈ పద్యముల యింపుసొంపుల వివరించుటకు నేను చాలను గాని ఆపాత్తము నందలి ప్రత్యక్షరము తెలుఁగు దేశము నీది తెలుఁగు ప్రాణివి నీవు, తెలుఁగు రాష్ట్రమును సంపాదించుటే నీకర్తవ్య మను విషయమును ప్రబోధించు చున్నది. అక్షరలక్షలు చేయు నీ పద్యములు రాష్ట్రసంపాదన యందు ఆంధ్రులకు గల అలసత్వమును బాపి రాష్ట్ర సంపాదన దీక్షాదక్షులనుగ జేయుచున్నవి. శ్రీ చౌదరిగారి కవితకు అమరత్వమును సిద్ధింప జేయుటకు రాష్ట్రగాన మొక్కటే చాలును.

ప్రత్యేకాంధ్రరాష్ట్రమునకై అహర్నిశలు పాటుబడు శ్రీశ్రీశ్రీ చల్లపల్లి రాజావారు రాష్ట్రగానమునకు కృతిపతులగుటయు, కృతికర్త యగు శ్రీ తుమ్మలసీతారామమూర్తి చౌదరిగారు కవిసమ్మానము నందుటయు ముదావహ మగు విషయము.

తెలుఁగుసీమ నానాట నిట్టి కవివరేణ్యులను గుర్తించి సమ్మానింప దొరకొనుట సంస్తవనీయము. ఈ చక్కని జాతీయాత్మగల కవిసోదరుఁ డింకను దేశాభిమాన పూరితములగు రచన లనేకము విరచించి యశోవిశాలుడై విరాజిల్లునట్లు భగవాను డనుగ్రహించునుగాక.